# బైబిలుదర్శిని

## THE BIBLE HANDBOOK


Edited By

G. W. FOOTE & W. P. BALL


## 4. అశ్లీలాలు


అనువాదం

పెన్మెత్స సుబ్బరాజు



పశ్చిమ గోదావరిజిల్లా హేతువాద సంఘం

పాలకొల్లు - 534 260

# బైబిలు దర్శిని

# THE BIBLE HANDBOOK

Edited By

**G. W. FOOTE & W. P. BALL**

## 4. అశ్లీలాలు

అనువాదం

పెన్మెత్స సుబ్బరాజు

పశ్చిమ గోదావరిజిల్లా హేతువాద సంఘం

పాలకొల్లు - 534 260

BYBILUDARSINI - ASLEELALU

*Translated by :*
PENMETSA SUBBARAJU

తొలిముద్రణ : అక్టోబరు 1986
ప్రతులు 1000

ప్రతులకు :

చార్వాక ఎంటర్ ప్రైజెస్
పెదగోపురంపద్ద
పాలకొల్లు - 534 260
ప. గోదావరిజిల్లా ఏ. పి.

రావిపూడి వెంకటాద్రి
ఎడిటర్, హేతువాది.
చీరాల - 523 155

వెల : **4-00**

* బైబిలులో జుగుప్స కలిగించే రీతిలో చెప్పబడిన అసభ్యకర వర్ణనలను, అశ్లీల విషయాలను, అవినీతికర చేష్టలను ఈ పుస్తకంలో పొందుపరచడం జరిగింది. ప్రతి సందర్భంలోను ఆయా విషయాన్ని తేలికగా పట్టియిచ్చే శీర్షిక ఉంచబడింది.

ప్రచురణ :
పశ్చిమ గోదావరిజిల్లా హేతువాద సంఘం
పాలకొల్లు - 534 260

---

ముద్రణ : వాణీ ఆర్ట్ ప్రింటర్స్, తెనాలి-1

# బైబిలు దర్శిని

## 4. అశ్లీలాలు

## (అవినీతులు, అసభ్యాలు, అశ్లీలాలు)

ప్రపంచ జనాభా అంతా వావి వరసలు లేకుండ పుట్టిన వాళ్లే!

ఆదాము తన భార్యయైన హవ్వను కూడెనప్పుడు ఆమె గర్భవతియై కయీనును కని....కయీను తన భార్యను కూడినప్పుడు ఆమె గర్భవతియై హనోకును కనెను ....ఆదాము మరల తన భార్యను కూడినప్పుడు ఆమె కుమారుని కని....షేతు అను పేరు పెట్టెను. మరియు షేతునకు కూడ కుమారుడు పుట్టెను. అతనికి ఎనోషను పేరు పెట్టెను. ఆది 4 ; 1, 17, 25, 26.

(దీన్ని బట్టి ఆది మానవులైన ఆదాము, హవ్వల కుమారులు కుమార్తెలు వావి వరుసల్లేకుండ సంతానం కని ఉండాలి. అలా కాకుండ దేవుడు ఆదిలో రెండు జంటలను సృష్టించి వుంటే దీన్ని సులభంగా నిరోధించేవాడే గదా!)

నోవహు దిగంబర ప్రదర్శన !

నోవహు....ద్రాక్షారసము త్రాగి మత్తుడై తన గుడారములో వస్త్రహీనుడుగా నుండెను. అప్పుడు కనానుకు తండ్రియైన హాము తన తండ్రి వస్త్రహీనుడై యుండుట చూచి బయట నున్న తన యిద్దరు సహోదరులకు ఆ సంగతి తెలిపెను అప్పుడు షేమును యాపెతును వస్త్రమొకటి తీసికొని తమ యిద్దరి భుజముల మీద వేసికొని వెనుకకు నడచి వెళ్ళి తమ తండ్రి దిసమొలను కప్పిరి; వారి ముఖములు వెనుకతట్టు ఉండుట వలన తమ తండ్రి దిసమొలను చూడలేదు. అప్పుడు నోవహు మత్తు నుండి మేలుకొని తన చిన్న కుమారుడు చేసిన దానిని తెలిసికొని -కనాను శపింపబడినవాడై తన సహోదరులకు దాసాను దాసుడగును. అనెను

ఆది 9: 20-25

[జలప్రళయంలో రక్షింపబడిన, నిందారహితుడైన నోవహు (ఆది 6: 9) ద్రాక్షరసం త్రాగి ఆ మత్తులో వివేకం కోల్పోయి ప్రవర్తించాడు. నిందా రహితుడు, సత్ప్రవర్తనకు మూలపురుషుడైన నోవహు తాను చేసిన పాడు పనికి తనను నిందించుకోవడంపోయి అది చూచిన తన కొడుకును, అతని సంతానాన్ని శపించాడు.]

### అబ్రాహాము తన తండ్రి కుమార్తెను పెండ్లాడాడు !

ఈమె నా చెల్లెలను మాట నిజమే; ఆమె నా తండ్రి కుమార్తె గాని నా తల్లి కుమార్తెగాదు: ఆమె నాకు భార్యయైనది. ఆది 20 : 12

### భార్య గౌరవంతో వ్యాపారం చేసిన అబ్రాహాము

అతడు ఐగుప్తులో ప్రవేశించుటకు సమీపించినప్పుడు అతడు తన భార్యయైన శారయితో-ఇదిగో నీవు చక్కనిదానివని యెరుగుదును. ఐగుప్తీయులు నిన్ను చూచి యీమె అతని భార్య అని చెప్పి నన్ను చంపి నిన్ను బ్రదుక నిచ్చెదరు. నీ వలన నాకు బ్రదుకు నట్లును నీవు నా సహోదరివని దయచేసి చెప్పుమనెను. అబ్రాము ఐగుప్తులో చేరినప్పుడు ఐగుప్తీయులు ఆ స్త్రీ మిక్కిలి సౌందర్యవతియయి యుండుట చూచిరి ఫరో యొక్క అధిపతులు వారిని చూచి ఫరో యెదుట ఆమెను పొగిడిరి గనుక ఆ స్త్రీ ఫరో యింటికి తేబడెను. అతడామెను బట్టి అబ్రామునకు మేలు చేసెను. అందువల్ల అతనికి గొఱ్ఱెలు గొడ్లు మగగాడిదలు దాసులు పని కత్తెలు ఆడుగాడిదలు ఒంటెలు యియ్యబడెను. అయితే యెహోవా అబ్రాము భార్యయయిన శారయిని బట్టి ఫరోను అతని యింటి వారిని మహావేదనల చేత బాధించెను. అప్పుడు ఫరో అబ్రామును పిలిపించి నీవు నాకు చేసినది యేమిటి ? ఈమె నీ భార్య అని నాకెందుకు తెలుపలేదు ? ఈమె నా సహోదరి అని యేల చెప్పితివి? నేనామెను నా భార్యగా చేసికొందునేమో అయితే నేమి, ఇదిగో నీభార్య; ఈమెను తీసికొని పొమ్మని చెప్పెను. ఆది 12 : 11-20

అబ్రాహాము తన భార్యయయిన శారాను గూర్చి-ఈమె నా చెల్లెలనిచెప్పెను గనుక గెరారు రాజైన అబీమెలెకు శారాను పిలిపించి తన యింట చేర్చుకొనెను .... అబీమెలెకు-నీవేమి చూచి ఈ కార్యము చేసితివని అబ్రాహాము-నడుగగా

అబ్రాహాము ఈస్థలమందు దేవుని భయము ఏమాత్రమును లేదు గనుక నానిమిత్తము నన్ను చంపుదురనుకొని చేసితిని....అబీమెలెకు గొఱ్ఱెలను గొడ్లను దాసదాసీజనులను రప్పించ అబ్రాహాము కిచ్చి అతని భార్యయైన శారాను అతనికి తిరిగి అప్పగించెను. అప్పుడు అబీమెలెకు-ఇదిగో నా దేశము నీ యెదుటనున్నది. నీ కిష్టమైన స్థలమందు కాపురముండుమనెను. మరియు అతడు శారాతో-ఇదిగోనీ అన్నకు నేను వెయ్యి రూపాయలిచ్చియున్నాను ... ఈవిషయ మంతటిలో నీకు న్యాయము తీరిపోయినదనెను. అబ్రాహాము దేవుని ప్రార్థింపగా దేవుడు అబీమెలెకును అతని భార్యను అతని దాసీలను బాగుచేసెను: వారు పిల్లలు కనిరి. ఏలయనగా అబ్రాహాము భార్యయైన శారాను బట్టి దేవుడు అబీమెలెకు యింటిలో ప్రతి గర్భమును మూసియుండెను. ఆది 20 : 2-18

## అబ్రాము ఉంపుడు గత్తె

అతడు (అబ్రాము) హాగరుతో పోయినప్పుడు అది గర్భవతి ఆయెను. అది తాను గర్భవతి నైతినని తెలిసికొనినప్పుడు దాని యజమానురాలు దాని దృష్టికి నీచమైనదాయెను. ఆది 16 : 4

## సున్నతి దేవుడు ఏర్పరచినదే

నాకును నీకును నీ తరువాత నీ సంతతికిని మధ్య మీరు గైకొనవలసిన నా నిబంధన యేదనగా - మీలో ప్రతి మగవాడును సున్నతి పొందవలెను. .... ఎనిమిది దినముల వయస్సు గలవాడు, అనగా నీ యింట పుట్టినవాడైనను నీ సంతానము కాని అన్యుని యొద్ద వెండితో కొనబడినవాడైనను మీ తరములలో ప్రతి మగవాడు మీలో సున్నతి పొందవలెను .... ఎవని గోప్యాంగ చర్మమున సున్నతి చేయబడదో అట్టివాడు తన జనులలో నుండి కొట్టివేయబడును.

ఆది 17 : 10-14

ఎనిమిదవ దినమున బిడ్డకు సున్నతి చేయింపవలెను. లేవీ 12 : 3
(ఆది 17 : 23-27 కూడ చూడండి)

## సొదొమ మనుష్యులకు లోతు తన కూతుళ్ళను అప్పగించ సిద్ధపడుట

ఇద్దరు దేవదూతలు సొదొమ చేరునప్పటికి లోతు సొదొమ గవిని యొద్ద కూర్చుండియుండెను. లోతు వారిని చూచి .... లేచి సాష్టాంగ నమస్కారము

చేసి నా ప్రభువులారా దయచేసి మీదాసుని యింటికి వచ్చి రాత్రి వెళ్ళబుచ్చి కాళ్లు కడుగుకొనుడి, మీరు పెందలకడ లేచి మీ త్రోవను వెళ్ళవచ్చుననెను. అందుకువారు అలాగుకాదు. నడివీధిలో రాత్రివెళ్ళబుచ్చెదమని చెప్పిరి. అయినను అతడు మిక్కిలి బలవంతము చేసినప్పుడువారు అతనితట్టు తిరిగి అతని యింట ప్రవేశించిరి .... వారు పండుకొనకముందు ఆ పట్టణస్థులు, అనగా సొదొమ మనుష్యులు, బాలురును వృద్ధులును ప్రజలందరును నలుదిక్కులనుండి కూడివచ్చి ఆ యిల్లు చుట్టవేసి లోతును పిలిచి — ఈ రాత్రి నీ యొద్దకు వచ్చిన మనుష్యులు ఎక్కడ? మేమువారిని కూడునట్లు మా యొద్దకు వారిని వెలుపలికి తీసికొని రమ్మని అతనితో చెప్పగా లోతు వెలుపల ద్వారము నొద్దనున్న వారి దగ్గరకు వెళ్ళి తన వెనుక తలుపు వేసి-అన్నలారా, ఇంత పాతకము కట్టుకొనకుడి: యిదిగో పురుషుని కూడని యిద్దరు కుమార్తెలు నాకున్నారు. సెలవైతే వారిని మీ యొద్దకు వెలుపలికి తీసికొని వచ్చెదను, వారిని మీ మనస్సు వచ్చునట్లు చేయుడి. ఆది 19 : 1-8

(లోతు అబ్రహాము సహోదరుని కుమారుడు. పరిశుద్ధుడుగా ఎంచబడినవాడు దేవుని చేత మైదానపు పట్టణమునుండి కాపాడబడినవాడు)

అక్కచెల్లెళ్ళిద్దరు త్రాగిన తండ్రితో కూడుట.

లోతు .... అతని యిద్దరు కుమార్తెలును ఒక గుహలో నివసించిరి. అట్లుండగా అక్క తన చెల్లెలితో — మన తండ్రి ముసలివాడు: సర్వ లోక మర్యాద చొప్పున మనతో పోవుటకు లోకములో ఏపురుషుడును లేడు మన తండ్రికి ద్రాక్షారసము త్రాగించి అతనితో శయనించి మన తండ్రి వలన సంతానము కలుగ జేసికొందము రమ్మనిచెప్పెను. ఆ రాత్రివారు తమ తండ్రికి ద్రాక్షారసము త్రాగించిన తరువాత అతని పెద్ద కుమార్తె లోపలికి వెళ్ళి తన తండ్రితో శయనించెను. కాని ఆమె ఎప్పుడు శయనించెనో ఎప్పుడు లేచిపోయెనో అతనికి తెలియ లేదు. మరునాడు అక్క తన చెల్లెలిని చూచి-నిన్నటిరాత్రి నా తండ్రితో నేను శయనించితిని. ఈ రాత్రి అతనికి ద్రాక్షారసము త్రాగించిన తరువాత నీవు లోపలికి వెళ్ళి అతనితో శయనించుము, అలాగున మన తండ్రి వలన సంతానము కలుగ జేసికొందమని చెప్పెను. ఆ రాత్రియు వారు తమ తండ్రికి ద్రాక్షారసము త్రాగించిరి అప్పుడా చిన్నది లేచి అతనితో శయనించెను. ఆమె యెప్పుడు శయనించెనో

యెప్పుడు లేచి పోయెనో అతనికి తెలియలేదు. ఆలాగున లోతు యొక్క యిద్దరు కుమార్తెలు గర్భవతులైరి. వారిలో పెద్దది కుమారుని కని మోయాబను పేరుపెట్టెను .... చిన్నది కూడా కుమారుని కని బెన్నమ్మి అనుపేరు పెట్టెను.

ఆది 19 : 30—38

[లోతు భార్య వెనుకకు తిరిగి చూచినందున ఉప్పు స్తంభంగా మార్చబడింది. (ఆది 19:26) కాని వావి వరసలు లేకుండా ప్రవర్తించినందుకు శిక్ష విధించబడిన దాఖలా బైబిలులో ఎక్కడాలేదు (2 పేతు 2 : 7, 8) ఈ రకంగా పుట్టిన పిల్లలు గొప్ప జాతులకు మూల పురుషులయ్యారు. అందులో రూతు నుండి వచ్చిన ఒక వంశములోని వ్యక్తే యేసు.

(రూతు 4 : 10, 21, 22)]

కవల పిల్లల పుట్టుక గూర్చిన వర్ణన

ఇస్సాకు భార్య గొడ్రాలు గనుక అతడు ఆమె విషయమై యెహోవాను వేడుకొనెను. యెహోవా అతని ప్రార్థన వినెను గనుక అతని భార్యయైన రిబ్కా గర్భవతి ఆయెను. ఆమె గర్భములో శిశువులు ఒకనితో నొకడు పెనుగులాడిరి గనుక ఆమె-ఈ లాగైతే నేను బ్రదుకుట యెందుకని అనుకొని ఈ విషయమై యెహోవాను అడుగ వెళ్ళెను. అప్పుడు యెహోవా ఆమెతో యిట్లనెను-రెండు జనములు నీగర్భములోకలవు .... ఒక జనపదము కంటె ఒక జనపదము బలిష్టమై యుండును. పెద్దవాడు చిన్నవానికి దాసుడగును అనెను. ఆమె ప్రసూతి కావలసిన దినములు నిండినప్పుడు ఆమె గర్భమందు కవల వారు ఉండిరి. మొదటివాడు ఎఱ్ఱనివాడుగా బయటకివచ్చెను. .... తరువాత అతని సహోదరుడు బయటికి వచ్చెను. ఆది 25 : 21-26

ఇస్సాకు కూడా అబ్రాము వలెనే భార్యనిచెల్లెలుగా చెలామణిచేయుట

ఇస్సాకు గెరారులో నివసించెను. ఆ చోటి మనుష్యులు అతని భార్యను చూచి-ఆమె యెవరని ఆడిగినప్పుడు అతడు-ఆమె నా సహోదరి అనిచెప్పెను ఎందుకనగా రిబ్కా చక్కనిది గనుక ఈ చోటి మనుష్యులు ఆమె నిమిత్తము నన్ను చంపుదురేమో అనుకొని తన భార్య అని చెప్పుటకు భయపడెను. అక్కడ

అతడు చాలదినములుండిన తరువాత ఫిలిష్తీయుల రాజైన అబీమెలెకు కిటికీలోనుండి చూచి నప్పుడు ఇస్సాకు తన భార్యయైన రిబ్కాతో సరసమాడుట కనబడెను. అప్పుడు అబీమెలెకు ఇస్సాకును పిలిపించి — ఇదిగో ఆమె నీ భార్యయే-ఆమె నా సహోదరి అని యేల చెప్పితివని అడుగగా ఇస్సాకు-ఆమెను బట్టి నేను చని పోవుదునేమో అనుకొంటినని అతనితో చెప్పెను. అందుకు అబీమెలెకు-నీవు మాకు చేసిన ఈ పనియేమి ? ఈ జనులలో ఎవడైన ఆమెతో నిర్భయముగా శయనించ వచ్చునే. అప్పుడు నీవు మా మీదికి పాతకము తెచ్చిపెట్టువాడవుగదా అనెను .... ఇస్సాకు ఆదేశమందున్న వాడై విత్తనము వేసి ఆ సంవత్సరము నూరంతలు ఫలము పొందెను. యెహోవా అతనిని ఆశీర్వదించెను. గనుక ఆ మనుష్యుడు గొప్పవాడాయెను. ఆది 26 : 6-12

యాకోబు అక్క చెల్లెళ్ళను పెళ్లాడి వారి దాసీలను కూడా కూడుట

రాత్రివేళ తన కుమార్తెయైన లేయాను అతని యొద్దకు తీసికొనిపోగా యాకోబు ఆమెను కూడెను. మరియు లాబాను తన దాసియైన జిల్పాను తన కుమార్తెయైన లేయాకు దాసిగా ఇచ్చెను. ఉదయమందు ఆమెను లేయా అని యెరిగి అతడు లాబానుతో నీవు నాకు చేసిన పని యేమిటి ? రాహేలు కోసమే గదా నీకు కొలువు చేసితిని ? ఎందుకు నన్ను మోసపుచ్చితివనెను. అందుకు లాబాను పెద్ద దానికంటె ముందుగా చిన్నదాని నిచ్చుట మా దేశ మర్యాదకాదు. ఈమె యొక్క వారము సంపూర్ణము చేయుము. నీవిక యేడు సంవత్సరములు నాకు కొలువు చేసిన యెడల అందుకై ఆమెను కూడ నీకిచ్చెదమని చెప్పగా యాకోబు అలాగు చేసి ఆమె వారము సంపూర్తియైన తరువాత అతడు తన కుమార్తెయైన రాహేలును అతనికి భార్యగా ఇచ్చెను. మరియు లాబాను తన దాసియగు బిల్హాను తనకుమార్తెయైన రాహేలుకు దాసిగాయిచ్చెను. యాకోబు రాహేలును కూడెను. మరియు అతడు లేయా కంటె రాహేలును బహుగా ప్రేమించి అతనికి మరి యేడేండ్లు కొలువు చేసెను. ఆది 29 : 23-30

రాహేలు తాను యాకోబునకు పిల్లలు కనక పోవుట చూచి తన అక్క యందు అసూయపడి యాకోబుతో-నాకు గర్భ ఫలము నిమ్ము: లేనియెడల నేను చచ్చెదననెను యాకోబు కోపము రాహేలు మీద రగులు కొనగా అతడు-నేను నీకు

గర్భ ఫలము ఇయ్యక పోయిన దేవునికి ప్రతిగా నున్నానా అనెను. అందుకామె నాదాసియైన బిల్హా ఉన్నది గదా: ఆమెతో పొమ్ము: ఆమె నా కొరకు పిల్లలను కనును: అలాగున ఆమె వలన నాకు పిల్లలు కలుగుదురని చెప్పి తన దాసియైన బిల్హాను అతనికి భార్యగాఇచ్చెను. యాకోబు ఆమెతో పోగా బిల్హా గర్భవతియై యాకోబునకు కుమారుని కనెను .... రాహేలు దాసియైన బిల్హా తిరిగి గర్భవతియై యాకోబునకు రెండవ కుమారుని కనెను .... లేయా తనకు కానుపు ఉడుగుట చూచి తన దాసియైన జిల్పాను తీసికొని యాకోబునకు ఆమెను భార్యగా ఇచ్చెను. లేయా దాసియైన జిల్పాను తీసికొని యాకోబునకు కుమారుని కనెను.

ఆది 30 : 1-10

## దీనాను చెరచడం-ప్రతీకారంగా మూకుమ్మడి హత్యలు

లేయా యాకోబునకు కనిన కుమార్తెయైన దీనా ఆ దేశపు కుమార్తెలను చూడవెళ్ళెను. ఆదేశము నేలిన హివ్వీయుడైన హమోరు కుమారుడగు షెకెము ఆమెను చూచి ఆమెను పట్టుకొని ఆమెతో శయనించి ఆమెను అవమాన పరచెను. .... ఆ చిన్నదాని నాకు పెండ్లి చేయుమని తన తండ్రియైన హమోరును అడిగెను. తన కుమార్తెను అతడు చెరిపెనని యాకోబు విని, తన కుమారులు....వచ్చువరకు ఊరకుండెను — అది చేయరాని పని గనుక ఆ మనుష్యులు సంతాపము పొందిరి, వారికి మిగుల కోపమువచ్చెను. అప్పుడు హమోరు వారితో - షెకెము అను నా కుమారుని మనస్సు మీ కుమార్తె మీదనే ఉన్నది. దయచేసి ఆమెను అతనికిచ్చి పెండ్లిచేయుడి .... ఈ దేశము మీయెదుట ఉన్నది ఇందులో మీరు నివసించి వ్యాపారముచేసి ఆస్తి సంపాదించుకొనుడని చెప్పెను. మరియు షెకెము-మీ కటాక్షము నా మీద రానీయుడి. మీరేమి అడుగుదురో అది ఇచ్చెదను .... అయితే తమ సహోదరియైన దీనాను అతడు చెరిపినందున యాకోబు కుమారులు షెకెముతోను అతని తండ్రియైన హమోరుతో కపటముగా ఉత్తరమిచ్చి అనిన దేమనగా — మేము ఈ కార్యము చేయలేము. సున్నతి చేయించు కొనని వానికి మా సహోదరిని ఇయ్యలేము, అది మాకు అవమానమగును మీలో ప్రతి పురుషుడు సున్నతి పొంది మావలె నుండిన యెడల సరి: ఆ పక్షమందు మీమాట కొప్పుకొని, మాపిల్లలను మీకిచ్చి మీ పిల్లలను మేము పుచ్చుకొని మీ మధ్య నివసించెదము, అప్పుడు మనము ఏక జనమగుదుము. మీరు

మా మాట విని సున్నతి పొందని యెడల మా పిల్లను తీసికొని పోవుదు మనగా....
ఆ చిన్నవాడు యాకోబు కుమార్తెయందు ప్రీతిగలవాడు గనుక అతడు ఆకార్యము
చేయుటకు తడవు చేయలేదు. హమోరును అతని కుమారుడు షెకెమును తమ ఊరి
గవిని యొద్దకు వచ్చి తమ ఊరి జనులతో - ఆమనుష్యుడు సున్నతి పొందు
నట్లు మనలో ప్రతి పురుషుడు సున్నతి పొందిన యెడలనే మన మాటకు వారు
ఒప్పుకొని మనలో నివసించి ఏక జనముగా నుందురు. వారి మందలు వారి ఆస్తి
వారి పశువులన్నియు మనవగునుగదా .... అప్పుడతని ఊరి గవిని ద్వారా వెళ్ళు
వారిలో ప్రతి పురుషుడు సున్నతిపొందెను. మూడవ దినమున వారు బాధపడు
చుండగా యాకోబు కుమారులలో నిద్దరు, అనగా దీనా సహోదరులైన షిమ్యో
నును, లేవీయు తమ కత్తులు చేత పట్టుకొని ఎవరికి తెలియకుండ ఆ ఊరి మీద
పడి ప్రతి పురుషుని చంపిరి. వారు హమోరును అతని కుమారుడైన షెకె
మును కత్తివాత చంపి షెకము నుండి దీనాను తీసికొని వెళ్ళిపోయిరి. తమ
సహోదరుని చెరిపినందున యాకోబు కుమారులు చంపబడినవారు ఉన్నచోటికి
వచ్చి ఆ .... ఊరిలోనిదేమి పొలములోనిదేమి .... యావత్తును తీసికొని
పిల్లల నందరిని స్త్రీలను చెరపట్టి .... అంతయు దోచుకొనిరి .... అందుకు వారు
వేశ్యయెడల జరిగించినట్లు మా సహోదరి యెడల ప్రవర్తింపవచ్చునా అనిరి.
ఆది 34 : 1-31

వావివరసలు లేకుండ తన తండ్రి ఉపపత్నితో శయనించిన రూబేను

ఇశ్రాయేలు ఆదేశములో నివసించు చున్నపుడు రూబేను వెళ్ళి తన తండ్రి ఉపపత్నియైన బిల్హాతో శయనించెను. ఆది 35 : 22

రూబేనూ నీవు నా పెద్దకుమారుడవు. నా శక్తియు నా బలముయొక్క ప్రథమ ఫలమును ఔన్నత్యాతిశయమును బలాతిశయమును నీవే, నీళ్ళవలె చంచలుడవై నీవు అతిశయము పొందవు. నీ తండ్రి మంచము మీదికెక్కితివి. దానిని అపవిత్రము చేసితివి. అతడు నామంచముమీది కెక్కెను. ఆది 49 : 3, 4

తన కోడలికి సంతానం కన్న యూదా

దాని తన గొఱ్ఱెల బొచ్చు కత్తిరించుటకు తిమ్నాతునకు వెళ్ళుచున్నాడని తామారునకు తెలుపబడెను. అప్పుడు షేలా పెద్దవాడైనప్పటికిని తాను అతని

కియ్యబడకుండుట చూచి తన వైధవ్య వస్త్రములను తీసివేసి, ముసుకు వేసికొని శరీరమంతయు కప్పుకొని తిమ్నాతునకు పోవు మార్గములో .... కూర్చుండగా, యూదా ఆమెను చూచి, తన ముఖము కప్పుకొని నందున వేశ్య అనుకొని ఆ మార్గమున ఆమె దగ్గరకు బోయి, ఆమె తన కోడలని తెలియక–నీతో పోయెదను రమ్మని చెప్పెను. అందుకామె నీవు నాతో వచ్చిన యెడల నాకేమి ఇచ్చెదవని అడిగెను. అందుకతడు-నేను మందలో నుండి మేకపిల్లను పంపెదనని చెప్పినప్పుడు. ఆమె-అది పంపువరకు ఏమైనా కుదువ పెటిన యెడల సరే అనిచెప్పెను... ముద్రయు దాని దారమును .... చేతి కఱ్ఱయు .... అతడు ఆమె కిచ్చి ఆమెతో పోయెను. ఆమె అతని వలన గర్భవతి యాయెను. .... తరువాత యూదా ఆ స్త్రీ యొద్దనుండి ఆ కుదువను పుచ్చుకొనుటకు అదుల్లామీయునిచేత మేకపిల్లను పంపినప్పుడు ఆమె అతనికి కనబడలేదు ... ఆ వేశ్య ఎక్కడనున్నదని ఆచోటి మనుష్యులను అడుగగావారు యిక్కడ వేశ్య ఎవతెయు లేదని చెప్పిరి. కాబట్టి అతడు యూదా యొద్దకు తిరిగి వెళ్ళి .... ఆ చోటి మనుష్యులు - యిక్కడి వేశ్య యెవతెయు రాలేదని చెప్పిరని అనినప్పుడు యూదా— మనలను అపహాస్య చేసెదరేమో, అమె వాటిని ఉంచుకొననిమ్ము; ఇదిగో నేను ఈ మేకపిల్లను పంపితిని, ఆమె నీకు కనబడలేదు అనెను. రమారమి మూడునెలలైన తరువాత నీ కోడలగు తామారు .... జారత్వము వలన గర్భవతియైనదని యూదాకు తెలుపబడెను. అప్పుడు యూదా - ఆమెను బయటికి తీసికొనిరండి, ఆమెను కాల్చివేయవలెనని చెప్పెను. ఆమెను బయటికి తీసికొని వచ్చినప్పుడు ఆమె తన మామ యొద్దకు ఆ వస్తువులను పంపి - ఇవి ఏవరివో ఆ మనుష్యుని వలన నేను గర్భవతినైతిని ఈ ముద్ర ఈ దారము ఈ కఱ్ఱ యెవరివో దయచేసి గురుతు పట్టమని చెప్పించెను యూదా వాటిని గురుతు పట్టి - నేను నా కుమారుడైన షేలాను ఆమెకియ్యలేదు. గనుక ఆమె నాకంటె నీతిమంతురాలని చెప్పి మరి యెప్పుడును ఆమెను కూడలేదు. ఆమె ప్రసవకాలమందు కవలవారు ఆమె గర్భమందుండిరి. ఆది 38 : 13-27.

## మరో కవలల జనన వర్ణన

ఆమె ప్రసవకాలమందు కవలవారు ఆమె గర్భమందుండిరి. ఆమె ప్రసవించుచున్నప్పుడు ఒకడు తన చెయ్యి బయటికి చాచెను. గనుక మంత్రసాని

ఎఱ్ఱనూలు తీసి వానిచేతికి కట్టి-ఇతడు మొదట బయటికి వచ్చెనని చెప్పెను. అతడు తన చెయ్యి వెనుకకు తీసినప్పుడు అతని సహోదరుడు బయటకి వచ్చెను. అప్పు డామె-నీ వేల భేదించుకొని వచ్చితివనెను. అందుచేత అతనికి పెరెసు (భేదము) అను పేరు పెట్టబడెను. తరువాత తన చేతిని తొగరు గల అతని సహోదరుడు బయటికివచ్చెను; అతనికి జెరహు అను పేరు పెట్టబడెను. ఆది 38 : 27-30

దుష్టురాలైన పోతీఫరు భార్య, పవిత్రుడైన యోసేపుల కథ

యోసేపు రూపవంతుడును సుందరుడునైయుండెను .... అతని యజమానునిభార్య యోసేపు మీద కన్నువేసి-తనతో శయనించుమని చెప్పెను. అయితే అతడు ఒప్పక .... నీవు అతని భార్యవైనందున నిన్ను తప్ప మరి దేనిని నా కప్పగింపక యుండలేదు. కాబట్టి నేనెట్లు ఇంత ఘోరమైన దుష్కార్యము చేసి దేవునికి విరోధముగా పాపము కట్టుకొందునని తన యజమానుని భార్యతోఅనెను. దిన దినము ఆమె యోసేపుతో మాటలాడు చుండెను. గాని అతడు ఆమెతో శయనించుటకైనను ఆమెతో నుండుటకైనను ఆమెమాట విన్నవాడుకాడు. అట్లుండగా ఒకనాడు. అతడుతన పని మీద ఇంటి లోపలికి వెళ్ళినప్పుడు ఇంటి మనుష్యులలో ఎవరును అక్కడలేరు అప్పుడామె అతని వస్త్రము పట్టుకొని తనతో శయనింపుమనిచెప్పగా అతడు తన వస్త్రమును ఆమెచేతిలో విడిచిపెట్టి తప్పించుకొని బయటకు పారిపోయెను....తప్పించుకొని పోవుట ఆమె చూచినప్పుడు తన యింటి మనుష్యులను పిలిచి—చూడుడి....నాతో శయనింపవలెనని వీడు నాయొద్దకు రాగా నేను పెద్ద కేకవేసితిని నేను బిగ్గరగా కేక వేయుట వాడు విని నా దగ్గర తన వస్త్రమునువిడిచి పెట్టి తప్పించుకొని బయటికి పారిపోయెనని వారితో చెప్పి....తన భర్తతో....నీవు మన యొద్దకు తెచ్చిన ఆ హెబ్రీవాసుడు నన్ను ఎగతాళి చేయుటకు నా యొద్దకు వచ్చెను. నేను బిగ్గరగా కేక వేసినప్పుడు వాడు తన వస్త్రము నా దగ్గర విడిచి పెట్టి తప్పించుకొని బయటికి పారిపోయెననెను. కాబట్టి అతని యజమానుడు .... భార్య తనతో చెప్పిన మాటలు విన్నప్పుడు కోపముతో మండిపడి .... అతనిని పట్టుకొని .... చెరసాలలో వేయించెను. ఆది 39 : 7-20

సిప్పోరా కుమారునికి సున్నతి చేయుట

అతడు పోవు మార్గమున సత్రములో యెహోవా అతనిని యెదుర్కొని

అతని చంపచూడగా సిప్పోరా వాడిగల రాయి తీసికొని తన కుమారునికి సున్నతి చేసి అతని పాదముల యొద్ద అది పడవేసి - నిజముగా నీవు నాకు రక్త సంబంధమైన పెనిమిటి వైతివనెను: అంత ఆయన అతనిని విడిచెను. అప్పుడు ఆమె ఈ సున్నతిని, బట్టి నీవు నాకు రక్త సంబంధమైన పెనిమిటివైతివనెను,

నిర్గ 4 : 24-26

జంతు శయనానికీ, వ్యభిచారదోషాలకు సంబంధించిన చట్టాలు

మృగ సంయోగం ;-

మృగసంయోగము చెయు ప్రతివాడు నిశ్చయముగా మరణశిక్ష నొందవలెను

నిర్గ 22 : 19

ఏ జంతువునందు నీ స్ఖలనముచేసి దానివలన అపవిత్రత కలుగ జేసికొన కూడదు: జంతువు స్త్రీని పొందునట్లు ఆమె దాని యెదుట నిలువరాదు: అది విపరీతము. లేవీ 18 : 23

జంతు శయనము చేయువానికి మరణ శిక్ష విధింపవలెను. ఆ జంతువును చంపవలెను. స్త్రీ తన్ను జంతువు పొందునట్లు దాని సమీపించిన యెడల ఆ స్త్రీకిని జంతువునకును మరణమే విధి లేవీ 20 : 15, 16

స్వలింగ సంపర్కం :-

స్త్రీ శయనము వలె పురుష శయనము కూడదు. అది హేయము.

లేవీ 18 : 22

ఒకడు స్త్రీతో శయనించినట్లు పురుషునితో శయనించిన యెడల వారిద్దరు హేయక్రియను చేసిరిగనుక వారికి మరణశిక్ష విధింపవలెను.

లేవీ 20 ; 13

స్త్రీలు సైతము స్వాభావికమైన ధర్మమును విడిచి స్వాభావిక విరుద్ధమైన ధర్మమును అనుసరించిరి. అటువలె పురుషులు కూడ స్త్రీ యొక్క స్వాభావికమైన ధర్మము విడిచి పురుషులతో పురుషులు అవాచ్యమైనది చేయుచు, తమ తప్పిదము

నకు తగిన ప్రతిఫలమును పొందుచు ఒకరి యెడల ఒకరు కామత ప్తులైరి.
రోమీ 1 : 26 27

వావివరసలేని లైంగిక సంబంధాలు :-

నీ తండ్రి భార్య మానాచ్ఛాదనమును తీయకూడదు: అది నీ తండ్రిదే. నీ సహోదరి మానాచ్ఛాదనమును, అనగా ఇంటిలో పుట్టినదేమి వెలుపల పుట్టినదేమి నీ తండ్రి కుమార్తెయొక్కయైనను నీ తల్లి కుమార్తెయొక్కయైనను మానాచ్ఛాదనమును తీయకూడదు. నీ కుమారుని కుమార్తె మానాచ్ఛాదనమునైనను కుమార్తె కుమార్తె మానాచ్ఛాదనమునైనను తీయకూడదు, అది నీది. నీ తండ్రి వలన పుట్టిన నీ తండ్రి భార్య కుమార్తె నీ సహోదరి. ఆమె మానాచ్ఛాదనమును తీయకూడదు. ఆమె నీ తండ్రి రక్తసంబంధి. నీ తల్లి సహోదరి మానాచ్ఛాదనమును తీయకూడదు: ఆమె నీతల్లి రక్త సంబంధి. నీతండ్రి సహోదరుని భార్యను సమీపింపకూడదు: ఆమె నీ పినతల్లి. నీకోడలి మానాచ్ఛాదనమును తీయకూడదు: ఆమె నీ కుమారుని భార్య .... నీ సహోదరుని భార్య మానాచ్ఛాదనమును తీయకూడదు. అది నీ సహోదరుని మానము. ఒకస్త్రీ మానాచ్ఛాదనమును ఆమె కుమార్తె మానాచ్ఛాదనమును తీయకూడదు: ఆమె కుమారుని కుమార్తె మానాచ్ఛాదనమునైనను ఆమె కుమార్తెకుమార్తె మానాచ్ఛాదనమునైనను తీయుటకు వారిని చేర్చుకొనకూడదు: వారు ఆమె రక్తసంబంధులు: అది దుష్కామ ప్రవర్తన. నీ భార్య బ్రతికి యుండగా ఆమెను పీడించుటకు ఆమె సహోదరి మానాచ్ఛాదనమును తీయుటకు ఈమెను ఆమెతో పెండ్లి చేసికొనకూడదు.
లేవీ 18 : 8-18

తన తండ్రి భార్యతో శయనించిన .... వారిద్దరికిని మరణశిక్ష విధింపవలె . ఒకడు తన కోడలితో శయనించినయెడల వారిద్దరికిని మరణశిక్ష విధింపవలెను .... ఒకడు స్త్రీతో శయనించినట్లు పురుషునితో శయనించిన యెడల .... వారికి మరణశిక్ష విధింపవలెను. ఒకడు స్త్రీని ఆమె తల్లిని పెండ్లి చేసికొనిన యెడల .... వానిని వారిని అగ్నితో కాల్చవలెను. జంతుశయనము చేయువానికి మరణశిక్ష విధింపవలెను. స్త్రీ తన్ను జంతువు పొందునట్లు దాని సమీపించిన యెడల ఆ స్త్రీకిని ఆ జంతువునకును మరణమే విధి .... ఒకడు .... తన తండ్రి కుమార్తెనేగాని తనతల్లి కుమార్తెనేగాని చేర్చుకొని ఆమె దిసమొలను వాడును వాని దిసమొలను ఆమెయు చూచిన యెడల .... వారికిని తమ జనుల యెదుట మరణ శిక్ష విధింపవలెను .... కడగా నున్న స్త్రీతో శయనించి ఆమె మానాచ్ఛా

దనమును తీసిన .... వారి ప్రజలలో నుండి వారిద్దరిని కొట్టివేయవలెను. నీ తల్లి సహోదరి మానాచ్ఛాదనమునేగాని నీ తండ్రి మానాచ్ఛాదనమునేగాని .... తీసిన.... వారు తమ దోషశిక్షను భరించెదరు. పినతల్లితోనేగాని పెత్తల్లితోనేగాని శయనించిన .... వారు .... సంతానహీనులై మరణమగుదురు. ఒకడు తన సహోదరుని భార్యను చేర్చుకొనిన యెడల .... వారు సంతానహీనులై యుందురు.

లేవీ 20 : 11-2.

[నిజానికి సర్వులూ చదవడానికి ఉద్దేశించిన గ్రంథంలో ఇలాంటి న్యాయ సూత్రాలు, సూచనలు చేర్చరాదు. మానభంగం, వావి వరుసతప్పడం, అస్వాభావికమైన నేరాలకు సంబంధించిన చట్టాలను పిల్లలకు ఉద్దేశించిన పుస్తకాల్లో చేరిస్తే ఎలాంటిఫలితం ఉంటుందో మనకు తెలియదా? అలాంటి వాటిని మరో గ్రంథంగా వేయవచ్చు. వావివరుసలు తప్పిన మూల పురుషుల సంగతి పరిశుద్ధ గ్రంథంలో ప్రస్తావనకు రానే 'దు. తన తండ్రి కూతుర్ని పెండ్లాడి నందుకు అబ్రాహాముకు మరణశిక్ష విధించవలసివుంది (లేవీ 20 : 17) భార్య బ్రతికుండగానే భార్య చెల్లెలిని పెండ్లాడిన యాకోబుకు (లేవీ 18 : 18, 29). యేసు వంశావళి మూలపురుషుడైన యూదా కోడలితో కలిసి చేసిన పాపానికి మామాకోడళ్ళిద్దరికి (లేవీ20:12) తండ్రి ఉపపత్నితో శయనించిన రూబేనుకు (లేవీ 20 : 11), మేనత్తను పెండ్లి చేసికొన్న అమ్రాముకు (నిర్గ 6 : 20 : లేవీ 20 : 19) కూడ మరణ శిక్ష విధించాలి.]

లైంగిక పరమైన మరికొన్ని నేరాలకు సంబంధించిన చట్టాలు

మానభంగం :-

ఒకడు ప్రధానము చేయబడిన చిన్నదానిని పొలములో .... బలిమిని పట్టి ఆమెతో శయనించిన యెడల ఆమెతో శయనించిన మనుష్యుడు మాత్రమే చావవలెను ఆ చిన్నదానియందు మరణపాత్రమైన పాపములేదు .... ఒకడు ప్రధానము చేయబడని కన్యకయైన చిన్నదానిని....పట్టుకొని ఆమెతో శయనింపగా....ఆమెతో శయనించినవాడు ఆ చిన్నదాని తండ్రికి యాబది వెండి రూకలిచ్చి ఆమెను పెండ్లి చేసికొనవలెను. ద్వితీ 22 : 25-29

జుగుప్సాకరం :-

ఒకనికి వీర్య స్ఖలనమైన యెడల వాడు సర్వాంగ స్నానము చేసికొని సాయంకాలము వరకు అపవిత్రుడై యుండును. వీర్య స్ఖలన మగునట్లు స్త్రీ పురుషులు శయనించిన యెడల వాళ్ళిద్దరు నీళ్ళతో స్నానము చేసి సాయంకాలము వరకు అపవిత్రులై యుందురు....ఒకడు ఆమెతో శయనించుచుండగా ఆమెరజస్సు వానికి తగిలిన యెడల, వాడు ఏడు దినములు అపవిత్రుడగును: వాడు పండుకొను ప్రతి మంచము అపవిత్రము ....స్రావము గలవానిగూర్చియు, వీర్యస్ఖలనము వలని అపవిత్రత గలవాని గూర్చియు, కడగా నున్న బలహీనురాలిని గూర్చియు, స్రావముగల స్త్రీ పురుషులను గూర్చియు, అపవిత్రురాలితో శయనించు వాని గూర్చియు విధింపబడినది ఇదే

లేవీ 15;16,18,24,32,33

కడగానున్న స్త్రీతో శయనించిన ఆమె మానాచ్ఛాదనమును తీసినవాడు ఆమె రక్తధారాచ్ఛాదనమును తీసివేసెను. వారి ప్రజలలోనుండి వారిద్దరిని కొట్టివేయవలెను. లేవీ 20 : 18

అవాచ్యం :-

మనుష్యులు ఒకనితో నొకడు పోట్లాడుచుండగా వారిలో ఒకని భార్య వానికొట్టుచున్నవాని చేతిలో నుండి తన పెనిమిటిని విడిపించుటకు వచ్చి చెయ్యి చాచి వానిమానము పట్టుకొనిన యెడల ఆమె చేతిని ఛేదింపవలెను. నీ కన్ను కటాక్షింపకూడదు. ద్వితీ 25 : 11, 12

జారత్వం :-

ఒకనికి ప్రధానము చేయబడిన దాసి వెల యిచ్చి విమోచింప బడకుండగానేమి ఊరక విడిపింపబడకుండగానేమి ఒకడు దానితో శయనించి వీర్య స్ఖలనము చేసిన యెడల వారిని శిక్షింపవలెను: అది విడిపింపబడలేదు. గనుక వారికి మరణశిక్ష విధింపకూడదు. లేవీ 19 : 20

యాజకుని కుమార్తె జారత్వము వలన తన్ను అపవిత్ర పరచుకొనిన యెడల ఆమె తన తండ్రిని అపవిత్ర పరచునది. అగ్నితో ఆమెను దహింపవలెను

లేవీ 21 : 9

వ్యభిచారం :-

ఒకడు మగనాలితో శయనించుచుండగా కనబడినయెడల వారిద్దరు, అనగా ఆ స్త్రీతో శయనించిన పురుషుడును ఆ స్త్రీయును చంపబడవలెను.

ద్వితీ 22 : 22

కన్యకాన్యభిచారం :-

ఆ చిన్నదాని యందు కన్యకాలక్షణములు కనబడని యెడలవారు ఆమె తండ్రి యింటి యొద్దకు ఆ చిన్నదానిని తీసికొని రావలెను. ఆమెను రాళ్ళతో చావగొట్టవలెను. ద్వితీ 22 : 20, 21

కొజ్జాగిరి ;-

గాయము నొందిన వృషణములు గలవాడేగాని, మర్మాంగము కోయబడిన వాడేగాని యెహోవా సమాజములో చేరకూడదు. ద్వితీ 23 : 1

తల్లి గర్భము నుండి నపుంసకులుగా పుట్టినవారుగలరు, మనుష్యుల వలన నపుంసకులుగా చేయబడిన నపుంసకులునుగలరు, పరలోకరాజ్యము నిమిత్తము తమ్మును తామే నపుంసకులుగా చేసికొనిన నపుంసకులును గలరు

మత్త 19 : 12

పురిటి మురికి :-

యెహోవా మోషేకు ఈలాగు సెలవిచ్చెను .... ఒక స్త్రీ గర్భవతియై మగ పిల్లను కనిన యెడల ఆమె యేడు దినములు పురిటాలై యుండవలెను. ఆమెతాను ముట్టుదై కడగా నుండు దినముల లెక్కనుబట్టి పురిటాలై యుండవలెను. .... ఆమె .... ముప్పదిమూడు దినములుండి తన రక్తశుద్ధి దినములు సంపూర్ణమగువరకు ఆమె పరిశుద్ధమైన దేనినైనను ముట్టకూడదు. పరిశుద్ధస్థలములో ప్రవేశింపకూడదు ఆమె ఆడు పిల్లలను కనిన యెడల .... కడగా ఉండునప్పటివలె రెండు వారము పురిటాలై ఉండవలెను. ఆమె తన రక్తశుద్ధి కొరకు అరువదియారు దినములు కడగా నుండవలెను. కుమారుని కొరకే గాని కుమార్తె కొరకేగాని ఆమె శుద్ధి దినములుసంపూర్తియైన తరువాత ఆమె దహనబలిగా ఒక యేడాది గొఱ్ఱెపిల్లను,

పాపపరిహారార్థ ఒక పావురపు పిల్లనైనను తెల్లగువ్వనైనను ప్రత్యక్షపు గుడారపు యొక్క ద్వారమునకు యాజకుని యొద్దకు తీసికొనిరావలెను. అతడు యెహోవా సన్నిధిని దానినర్పించి ఆమె నిమిత్తము ప్రాయశ్చిత్తముచేయగా ఆమె రక్తస్రావ విషయమై ఆమె పవిత్ర పరచబడును. ఇది మగపిల్లను గాని ఆడుపిల్లను గాని కనిన స్త్రీని గూర్చిన విధి. ఆమె గొఱ్ఱెపిల్లను తేజాలని యెడల ఆమె రెండు తెల్ల గువ్వలనైనను రెండు పావురపు పిల్లలనైనను దహనబలిగా ఒక దానిని పాప పరిహారార్థబలిగా ఒకదానిని తీసికొనిరావలెను. యాజకుడు ఆమె నిమిత్తము ప్రాయశ్చిత్తము చేయగా ఆమెకు పవిత్రత కలుగును. లేవీ 12 : 1-8

## మాతృత్వం పాపం :-

నేను పాపములో పుట్టినవాడను పాపములోనే నాతల్లి నన్ను గర్భమున ధరించెను. కీర్త 51 : 5

## అవిశ్వాసులైన భార్యలకు మ్యాజిక్ జల పరీక్ష

యెహోవా నీనడుము పడునట్లును నీ కడుపు ఉబ్బునట్లును చేయుట వలన యెహోవా నీ జనుల మధ్యను నిన్ను శపథమునకును ప్రమాణమునకును ఆస్పద ముగా చేయుగాక శాపము కలుగజేయు ఈ నీళ్ళు నీ కడుపు ఉబ్బునట్లును చేయుట నీ నడుము పడునట్లును చేయుటకు నీ కడుపులోనికి పోవునని చెప్పి యాజకుడు ఆస్త్రీ చేత శపథప్రమాణము చేయించిన తరువాత ఆస్త్రీ - ఆమేన్ అని చెప్పవలెను .... అతడు ఆమెకు ఆనీళ్ళు త్రాగించిన తరువాత జరుగున దేదనగా, అపవిత్ర పరచ బడి తన భర్తకు ద్రోహము చేసిన, యెడల శాపము కలుగజేయు ఆ నీళ్ళుచేదై ఆమె లోనికి చేరిన తరువాత ఆమె కడుపు ఉబ్బును ఆమె నడుము పడిపోవును. ఆస్త్రీత జనుల మధ్య శాపమున కాస్పదముగా నుండును.

సంఖ్యా 5 : 21, 22, 27

[అవిశ్వాసులైన భర్తలకు మాత్రం దేవుడు ఏరకమైన పరీక్షను నిర్దేశించ లేదు.]

## విదేశీయునితో వివాహానికి పరిహారం

సహాజము నుండిలేచి, యీటెను చేత పట్టుకొని పడక చోటికి ఆ ఇశ్రాయే

లీయుని వెంబడివెళ్ళి ఆ యిద్దరిని, అనగా ఆ ఇశ్రాయేలీయుని ఆస్త్రీని కడుపులో గుండ దూసి పొవునట్లు పొడిచెను: అప్పుడు ఇశ్రాయేలీయులలో నుండి తెగులు నిలిచి పోయెను .... వారు తంత్రములుచేసి పెయోరు సంతతిలోను, తెగులు దినమందు పెయోరు విషయములో చంపబడిన తమ సహోదరియు మిద్యానీయుల అధిపతి కుమార్తెయునైన కొజ్బీ సంగతిలోను, మిమ్మును మోసపుచ్చిరి.

సంఖ్యా 25 : 8, 17, 18.

## పురుష సంయోగ మెరుగని స్త్రీల పంపిణీ

మీరు పిల్లలలో ప్రతి మగవానిని పురుష సంయోగము ఎరిగిన ప్రతిస్త్రీని చంపుడి: పురుష సంయోగము ఎరుగని ప్రతి ఆడు పిల్లను మీ నిమిత్తము బ్రతుక నీయుడి .... ముప్పది రెండువేలమంది పురుష సంయోగమెరుగని స్త్రీలు .... వారిలో యెహోవా పన్ను ముప్పది యిద్దరు.

సంఖ్యా 31 ; 17, 18, 35, 40

## అనవసరమైన జుగుప్సాకర వర్ణన

ఆ మనుష్యుడు తన సంతానమును మోలెకుకు ఇచ్చుచుండగా మీ దేశ ప్రజలు వాని చంపక, చూచి చూడనట్లు తమ కన్నులు యూసికొనినయెడల నేను వానికిని వాని కుటుంబమునకును విరోధినై వానిని మోలెకుతో వ్యభిచరించుటకు వాని తరిమి వ్యభిచారము చేయు వారందరిని ప్రజలలో నుండి కొట్టి వే తు ను. మరియు కర్ణపిశాచి గలవారితోను సోదెగాండ్రతోను వ్యభిచరించుటకు వారితట్టు తిరుగు వాడెవడో నేను వానికి విరోధినై ప్రజలలోనుండి వాని కొట్టివేతును.

లేవీ 20 : 5, 6

వారు వ్యభిచారులై అనుసరించుచు వచ్చిన దెయ్యముల పేరట వధించు నట్లు ఇకమీదట తమబలి పశువులను వధింపరాదు. లేవీ 17 : 7

అంతటితో తృప్తి పొందక అష్షూరు వారితోను నీవు వ్యభిచరించితివి. వారితో కూడి జారత్వము చేసినను తృప్తి నొందకపోతివి యెహె 16 : 28

యెహోవా వాక్కు నాకు ప్రత్యక్షమై యీలాగు సెలవిచ్చెను-నరపుత్రుడా, ఒకతల్లికి పుట్టిన యిద్దరు స్త్రీలుకలరు. వీరు ఐగుప్తు దేశములో జారత్వముచేసిరి, యౌవన కాలమందే జారత్వము చేయుచువచ్చిరి, అక్కడ వారికి ఆలింగనమాయెను అక్కడవారి కన్యాకాలపు చనులను పురుషులు నలిపిరి. వారిలో పెద్దదానిపేరు ఒహొలా, ఆమె సహోదరి పేరు ఒహొలీబా వీరు నాకు పెండ్లి చేయబడిన వారై కుమారులను కుమార్తెలను కనిరి..ఒహొలా నాకు పెండ్లి చేయబడినను వ్యభిచారము చేసితన విటకాండ్ర మీద బహుగా ఆశపెట్టుకొని, ధూమ్ర వర్ణముగల వస్త్రములు ధరించుకొనిన సైన్యాధిపతులును అధికారులును అందము గల యౌవనులును గుఱ్ఱము లెక్కు రౌతులును అగు అష్షూరు వారిని మోహించెను. అది కాముకురాలి రీతిగా అష్షూరు వారిలో ... తిరుగుచు, వారందరితో వ్యభిచరించుచు వారు పెట్టుకొనిన విగ్రహములన్నిటిని పూజించుచు అపవిత్రురాలాయెను. మరియు ఐగుప్తులో .... దాని యౌవన మందే పురుషులు దానితో శయనించిరి, దాని చనులను ఆలింగనము చేసిరి, కాముకులై దానితో విశేషముగా వ్యభిచారము చేసిరి .... దాని చెల్లెలైన ఒహొలీబా దానిని చూచి కాముకత్వమందు దానిని మించి అక్క చేసిన జారత్వముల కంటె మరి ఎక్కువగా జారత్వము చేసెను. .... అష్షూరువారైన తన పొరుగు వారిని అది మోహించెను. .... అది యధికముగా వ్యభిచారము చేయవలెనని కోరినదై మొలలకు నడికట్లును. తలల మీద చిత్రవర్ణముగల పాగాలును పెట్టుకొని రాచకళలుగలవారై .... బబులోను వారివంటి కల్దీయుల పటములను చూచి మోహించెను. అదివారిని చూచి వెంటనే .... వారి యొద్దకు దూతలను పంపి వారిని పిలిపించుకొనగా బబులోనువారు సంభోగము కోరివచ్చి జారత్వము వాని చేత దానిని అపవిత్ర పరిచిరి .... అది జారత్వము అధికముగా చేసి దాని మానాచ్ఛాదనము తీసివేసికొనెను .... యౌవనదినములందు ఐగుప్తుదేశములో తాను జరిగించిన వ్యభిచారము మనస్సునకు తెచ్చుకొని అది మరి యెక్కువగా వ్యభిచారము చేయుచువచ్చెను. గాడిద గుఱ్ఱముల వంటి సిగ్గుమాలిన మోహముగల తన విటకాండ్రయందు అదిమోహము నిలుపుచుండెను. యౌవన కాలమందు నీవు ఐగుప్తీయుల చేత నీ చనులను నలిపించుకొనిన సంగతి జ్ఞాపకము చేసికొని నీ బాల్యకాలపు దుష్కార్యమును చేయవలెనని నీవు చూచుచుంటివి .... స్త్రీ లందరు మీ కామాతురత చొప్పున చేయకూడదని నేర్చుకొనునట్లు మీ కామాతురతను దేశములో నుండకుండ మాన్పించుదును. నేనే యెహోవానని మీరు తెలిసికొనునట్లు మీ కామా

తురతకు శిక్ష విధింపబడును, విగ్రహములను పూజించిన పాపము ను మీ రు భరిందురు. యెహె 23

["గాడిద గుఱ్ఱములవంటి సిగ్గుమాలిన మోహముగల తన విటకాండ్ర యందు అది మోహము నిలుపుచుండెను" అని "పరిశుద్ధగ్రంథము"లో పేర్కొన్న విషయాన్ని ''అక్కడ ఉన్న ఆమె విటుల జననేంద్రియాలు గాడిదలలాంటివి. వాళ్ళది గుర్రాల వీర్యస్ఖలనంలాంటిది. ఆమె వాళ్ళను మోహించింది" అని పవిత్రగ్రంథం'లో అనువదించారు-అను]

వ్యభిచార మనస్సును, విగ్రహముల ననుసరించిన వ్యభిచారదృష్టిని నేను మార్చి నా తట్టు తిరుగ జేయగా, చెరపట్టబడినవారై శేషించిన వారు అన్యజనుల మధ్య నన్ను జ్ఞాపకము చేసికొని, తామనుసరించిన హేయకృత్యముల .... తాను చేసిన దుష్క్రియలను కనుగొని తమ్మును తామే అసహ్యించు కొందురు.

యెహె 6 : 9

రాళ్ళతోను మొద్దులతోను వ్యభిచారము చేసెను. ఆమె నిర్భయముగా వ్యభిచారము చేసి దేశమును అపవిత్ర పరచెను .యిర్మీ 3 : 9

దేవదూతలలో ఒకడు వచ్చి నాతో మాటలాడుచు ఈ లాగుచెప్పెను. - నీ విక్కడికిరమ్ము, విస్తార జలముల మీద కూర్చున్న మహావేశ్యకు చేయబడు తీర్పు నీకు కనుపరచెదను భూరాజులు ఆమెతో వ్యభిచరించిరి, భూనివాసులు ఆమె వ్యభిచార మద్యములో మత్తులైరి .... ఆస్త్రీ .... అలంకరింపబడినదై, ఏహ్యమైన కార్యములతోను తాను చేయుచున్న వ్యభిచార సంబంధమైన అపవిత్ర కార్యముల తోను నిండిన యొక సువర్ణ పాత్రను తనచేత పట్టుకొనియుండెను. దాని నొసట దాని పేరు ఈలాగు వ్రాయబడియుండెను. - మర్మము, వేశ్యలకును భూమిలోని ఏహ్యమైన వాటికిని తల్లియైన మహాబబులోను .... వారు ఆ వేశ్యను ద్వేషించి, దానిని దిక్కులేని దానిగాను, దిగంబరిగాను చేసి, దాని మాంసము భక్షించి అగ్ని చేత బొత్తిగా కాల్చివేతురు. ప్రక 17 : 1-5, 16

వ్యభిచార మనస్సువారిని త్రోవ తప్పింపగా వారు తమ దేవుని విసర్జించి వ్యభిచరింతురు. హోషే 4 ; 12

ఎఫ్రాయిమీయులు వ్యభిచార క్రియలు అభ్యాసము చేసెదరు; ఇశ్రాయేలు వారు తమ్మును అపవిత్రపరచు కొనెదరు. హోషే 6 : 10

నీవు దేవుని విసర్జించి వ్యభిచరించితివి, నీ కళ్ళములన్నిటి మీదనున్న ధాన్యమును బట్టి నీవు పడుపు కూలిని ఆశించితివి: హోషే 9 : 1

చక్కనిదానవై చిల్లంగి తనమందు జ్ఞానము గలదానవై జారత్వముచేసి జనాంగముల మీద చిల్లంగి తనము జరిగించి సంసారములను అమ్మివేసిన దానా .... నీ చెంగులు నీ ముఖము మీదికెత్తి జనములకు నీ మానమును రాజ్యములకు నీ అవమానమును నేను బయలు పరతును. నహూ 3 : 4, 5

వారు ఇతరుల దేవతలతో వ్యభిచరించి ఆ దేవతలకు బలి అర్పించు చున్నప్పుడు ఒకడు నిన్ను పిలిచిన యెడల నీవు వాని బలి ద్రవ్యమును తినకుండ చూచుకొనుము: మరియు నీవు నీకుమారుల కొరకు వారి కుమార్తెలను పుచ్చుకొను నెడల వారి కుమార్తెలు తమ దేవతలతో వ్యభిచరించి నీ కుమారులను తమ దేవతలతో వ్యభిచరింపజేయుదురేమో నిర్గ 34 : 15, 16

మీదేవునికి ప్రతిష్ఠితులై యుండునట్లు మునుపటివలె కోరిన వాటిని బట్టియు చూచిన వాటిని బట్టియు వ్యభిచరింపక, దానిచూచి యెహోవా ఆజ్ఞలన్నిటిని జ్ఞాపకము చేసికొని వాటి ననుసరించుటకే అదిమీకు కుచ్చుగా నుండును.
సంఖ్యా 15 : 39

నిన్ను విడిచి వ్యభిచరించు వారినందరిని నీవు సంహరించెదవు.
కీర్త 73 ; 27

తమ క్రియల వలన అపవిత్రులైరి. తమ నడవడిలో వ్యభిచరించినవారైరి
కీర్త 106 : 39

(న్యాయా 2: 17 : 8 , 33 కూడ చూడండి)

అతని కున్న వారిలో ఒక మగపిల్లవానినైనను తెల్లవారు నప్పటికి నేనుండ నియ్యను: లేదా దేవుడు మరిగొప్ప అపాయము దావీదు శత్రువులకు కలుగ

జేయును గాక అని ప్రమాణము చేసియుండెను....నీవు త్వరపడి నన్ను ఎదుర్కొ-
నక పోయిన యెడల, నీకు హానిచేయకుండ నన్ను ఆటంక పరచిన ఇశ్రాయేలీ
యుల దేవుడైన యెహోవా జీవము తోడు తెల్లవారులోగా నాబాలునకు మగవాడొక
డును విడువబడడన్నమాట నిశ్చయము. 1సమూ 24:22,34.

[పై మాటలు దావీదు ఒక స్త్రీతో పలికినవి]

కాబట్టి యరొబాము సంతతి మీదికి నేను కీడు రప్పించుచు. ఇశ్రాయేలు వారిలో అల్పులుగాని ఘనులుగాని లేకుండ మగవారి నందరిని యరొబాము వంశము నుండి నిర్మూలముచేసి, పెంట అంతయు పోవునట్లుగా ఒకడు అవతలకు దానిని ఊడ్చివేసినట్లు యరొబాము సంతతిలో శేషించినవారి నేను ఊడ్చ వేయుదును. 1రాజు 14 : 10

అతడు సింహాసనాసీనుడై యేల నారంభించిన తోడనే బయెషా సంతతి వారందరిలో ఏ పురుషునేగాని అతని బంధువులలోను మిత్రులలోను ఎవరినేగాని మిగుల నియ్యక అందరిని హతము చేసెను. 1 రాజు 16 : 11

(1 రాజు 21 : 21: 2 రాజు 9 : 8 కూడ చూడండి)

రబ్షాకే—ఈ మాటలు చెప్పుటకై నా యజమానుడు నీ యజమానుని యొద్దకును నీ యొద్దకును నన్ను పంపెనా ?తమ మలమును తినునట్టును తమమూత్రమును త్రాగునట్లును మీతో కూడప్రాకారము మీద కూర్చున్న వారి యొద్దకును నన్నుపంపెను. గదా 2 రాజు 18 : 27

(యెష 36 : 12 కూడ చూడండి)

కాబట్టి మీరు సున్నతిలేని మీ హృదయమునకు సున్నతి చేసికొని యిక మీదట ముష్కరులు కాకుండుడి. ద్వితీ 10 : 16

నీవు బ్రదుకుటకై నీ పూర్ణ హృదయముతో .... ప్రేమించునట్లు నీ దేవుడైన యెహోవా తనకు లోబడుటకు నీ హృదయమునకును నీ సంతతివారి హృదయమునకును సున్నతి చేయును. దిత్వీ 30 : 6.

అవిధేయులై యుండుట మానుకొని మీ దుష్టక్రియలను బట్టి యెవడును ఆర్పివేయలేనంతగా నా ఉగ్రత అగ్నివలె కాల్చకుండునట్లు యూదావారలారా, యెరూషలేము నివాసులారా, యెహోవాకు లోబడియుండిరి.

యిర్మీ 4 : 4

అసహ్యాకరమైన దేవుడి భావాలు

మిమ్ములను బట్టి విత్తనములు చెరిపేతును, మీ ముఖములమీద పేడవేతును

మలా 2 : 3

యవల అప్పములు చేసి వారు చూచుచుండగా దానిని మనుష్య మలముతో కాల్చి భుజింపవలెను. యెహె 4 : 12

కాన్పు, బహిష్టు, గర్భం, వేశ్యావృత్తి, వ్యభిచారం వగైరాల అనవసర ప్రస్తావన

నీ గ్రామములో నీ శత్రువులు నిన్ను ఇరుకు పరుచుట వలనను ముట్టడి వేయుట వలనను ఏమియు లేక పోవుటచేత మీలో మృదుత్వమును అతిసుకుమార మును కలిగి .... నేల మీద తన అరకాలు మోపతెగింపని స్త్రీ తన కాళ్ళ మధ్య నుండి పడు మావిని తాను కనబోవు పిల్లలను తాను రహస్యముగా తినవలెనని తన కౌగిటి పెనిమిటి యెడలనైనను తన కుమారుని యెడలనైనను తన కుమార్తె యెడలనైనను కటాక్షము చూపకపోవును. ద్వితీ 28 : 56: 57

నీవు ఏమి కనుచున్నావని కన తండ్రితో చెప్పువానికి శ్రమ. నీవు గర్భము ధరించినదేమి అని స్త్రీతో చెప్పువానికి శ్రమ యెష 45 : 10

ఆమె పరుపు మీదనైనను ఆమె కూర్చుండిన దానిమీదనైనను ఉండినను ఉండినయెడల దానిని ముట్టినవాడు సాయంకాలము వరకు అపవిత్రుడైయుండును .... కడగానున్న బలహీనురాలిని గూర్చియు, స్రావముగల స్త్రీ పురుషులను గూర్చియు విధింపబడినది ఇదే. లేవీ 15 : 23, 32, 33.

ఎలీసబెతు మరియ యొక్క వందన వచనము వినగానే. ఆమె గర్భములో శిశువు గంతులువేసెను. అంతట ఎలీసబెతు పరిశుద్ధాత్మతో నిండుకొనినదై

బిగ్గరగా ఇట్లనెను .... ఇదిగో నీ శుభవచనము నా చెవిని పడగానే నా గర్భము లోని శిశువు ఆనందముతో గంతులువేసెను. లూకా 1 : 41, 44

లేయా ద్వేషింపబడుట యెహోవా చూచి ఆమె గర్భము తెరిచెను.
ఆది 29 : 31

దావీదు తన భార్యయైన బత్షెబను ఓదార్చి ఆమె యొద్దకు పోయి ఆమెను కూడగా ఆమె యొక కుమారుని కనెను. 2 సమూ 12 ; 24

గర్భమున పుట్టినది మొదలుకొని నాచేత భరింపబడిన వారలారా, తల్లి ఒడిలో కూర్చుండినది మొదలుకొని నేను చంకపెట్టుకొనిన వారలారా నా మాట ఆలకించుడి. యెష 46 : 3

డెబ్బది సంవత్సరముల అంతమున యెహోవా తూరును దర్శించును. అది వేశ్య జీతమునకు మరల భూమి మీద నున్న సమస్తలోక రాజ్యములతో వ్యభిచారము చేయును. యెష 23 : 17

చక్కని దానవై వేశ్యవై చిల్లంగి తనమందు జ్ఞానముగల దానవై జారత్వము చేసి జనాంగముల మీద చిల్లంగితనము జరిగించి సంసారములను అమ్మివేసిన దానా .... నీ చెంగులు నీ ముఖము మీదికెత్తి జనములకు నీ మానమును నేను బయలు పరుతును. నహూ 3 : 4, 5

భూరాజులు ఆమెతో వ్యభిచరించిరి. భూనివాసులు ఆమె వ్యభిచార మద్యములో మత్తులైరి. ప్రక 17 : 2

[ఇటువంటి భాష ఉపయోగించిన సందర్భాలు యింకా ఎన్నోఉన్నాయి, అందరూచదవడానికి ఉద్దేశించిన గ్రంథంలో ఇలాంటి మాటల్ని, భావాన్ని పొందు పరచడం చాల అభ్యంతరకరం]

స్త్రీలను చెరిపించడంలో దేవుడి ఘనత

వారు చూచుచుండగా .... వారి భార్యలు చెరుపబడుదురు.
యెష 13 : 16

యెరూషలేము మీద యుద్ధము చేయుటకు నేను అన్యజనుల నందరిని సమ

కూర్చబోవుచున్నాను .... స్త్రీలు చెరుపబడుదురు. పట్టణములో సగము మంది చెరపట్టబడిపోవుదురు. జెక 14 : 2

నీ యజమానుని స్త్రీలను నీ కౌగిట చేర్చి ఇశ్రాయేలు వారిని యూదా వారిని నీ కప్పగించితిని. ఇది చాలదని నీవనుకొనిన యెడల నేను మరి ఎక్కువగా నీ కిచ్చియుందును .... నేను సెల విచ్చున దేమనగా — నీ యింటివారి మూలముననే నేన నీకు అపాయము పుట్టింతును: నీవు చూచుచుండగా నేను నీ భార్యలను తీసి నీ చేరువ వాని కప్పగించెదను. పగటియందువాడు వారితో శయనించును.
2 సమూ 12 : 8, 11, 12

వారి భార్యలను అన్యుల కప్పగింతును. యిర్మీ 8 : 10

ఏమియు మిగులకుండ వారి యిండ్లును వారి పొలములును వారి భార్యలును ఇతరులకు అప్పగింపబడురురు. యిర్మీ 6 ; 12

స్త్రీని ప్రధానము చేసికొందువుగాని వేరొకడు ఆమెను కూడును.
ద్వితీ 28 : 30

స్త్రీలను చెరపట్టి పెళ్ళాడి విడిచివేయవచ్చు

నీవు నీ శత్రువులతో యుద్ధము చేయబోవునప్పుడు నీ దేవుడైన యెహోవా నీ చేతికి వారిని అప్పగించిన తరువాత వారిని చెరపట్టి ఆ చెరపట్టబడిన వారిలో రూపవతియైన దానిని చూచి ఆమెను మోహించి ఆమెను పెండ్లి చేసికొన మనస్సయి నీ యింట ఆమెను చేర్చుకొనిన తరువాత ఆమె తల క్షౌరము చేయించు కొని గోళ్ళను తీయించుకొని తన చెరబట్టలు తీసివేసి నీయింట నివసించి యొకనెల దినములు తన తండ్రులను గూర్చి ప్రలాపన చేయుటకు నీవు ఆమెకు సెలవియ్య వలెను. తరువాత నీవు ఆమె యొద్దకుపోయి ఆమెను పెండ్లిచేసికొనవచ్చును: ఆమె నీకు భార్యయగును. పునీ ఆమె న సంతుష్టినొందని యెడల ఆమె మనస్సు వచ్చిన చోటికి ఆమెను సాగనంపవలెను. ద్వితీ 21 : 10-14

బహు భార్యాత్వం

ప్రేమింపబడున దొకతెయు ద్వేషింపన దొకతెయు ఇద్దరు భార్యలు ఒక

పురుషునకు కలిగియుండి, ప్రేమింపబడినదియు ద్వేషింపబడునదియు వాని వలన బిడ్డలు కని జ్యేష్ఠ కుమారుడు ద్వేషింపబడిన దాని కొడుకైన యెడల .... జ్యేష్ఠునికి మారుగా ప్రేమింపబడిన దాని కొడుకును జ్యేష్ఠునిగా చేయకూడదు.

ద్వితీ 21 : 15, 16.

[దావీదు, సొలొమోను వంశముల మూల పురుషులు అనేకమంది స్త్రీలను పెండ్లాడటాన్ని బట్టి బైబిలు ఇటువంటి ఆచారాలను నిషేధించినట్టు కని పించదు:]

మరిది ధర్మం

సహోదరులు కూడి నివసించుచుండగా వారిలో ఒకడు సంతానము లేక చని పోయిన యెడల చనిపోయిన వాని భార్య అన్యుని పెండ్లి చేసికొనకూడదు, ఆమె పెనిమిటి సహోదరుడు ఆమె యొద్దకు పోయి ఆమెను పెండ్లి చేసికొని తన సహోదరునికి మారుగా ఆమె యెడల భర్త ధర్మము జరపవలెను. చనిపోయిన సహోదరుని పేరు ఇశ్రాయేలీయులలో నుండి తుడిచి వేయబడకుండునట్లు ఆమె కను జ్యేష్ఠ కుమారుడు చనిపోయిన సహోదరునికి వారసుడుగా నుండవలెను. అతడు తన సహోదరుని భార్యను పరిగ్రహింపనొల్లని యెడల వాని సహోదరుని భార్య పట్టణపు గవినికి, అనగా పెద్దల యొద్దకుపోయి - నా పెనిమిటి సహోదరుడు ఇశ్రాయేలీయులలో తన సహోదరునికి పేరు స్థాపింపనని చెప్పి దేవర ధర్మము చేయనొల్లడని తెలుపుకొనవలెను. అప్పుడు అతని యూరి పెద్దలు అతని పిలిపించి అతనితో మాటలాడిన తరువాతి అతడు నిలువబడి-ఆమెను పరిగ్రహించుట నా కిష్టము లేదనిన యెడల అతని సహోదరుని భార్య ఆ పెద్దలు చూచుచుండగా, అతని దాపునపోయి అతని కాలినుండి చెప్పు ఊడదీసి అతని ముఖము నెదుట ఉమ్మివేసి తన సహోదరుని యిల్లు నిలుపని మనుష్యునికి ఈ లాగుచేయబడునని చెప్పవలెను. అప్పుడు ఇశ్రాయేలీయులలో చెప్పు ఊడదీయబడిన వాని యిల్లని వానికి పేరు పెట్టబడును. ద్వితీ 25 : 5-10

[మార్కు 12 : 19-23 లలో యేసు ముందుకు వచ్చిన ఒక ప్రశ్నలో ఒకే స్త్రీని ఒకరు చనిపోయిన తరువాత ఒకరు ఏడుగురు సోదరులు అను

భవించి నట్లున్నది. ఈ భార్యకు ముందే వారికి స్వంత భార్యలు కూడ ఉండి వుండవచ్చు.]

రాహాబను వేశ్యను మెచ్చుకున్న దేవుడు

యెహోషువ వేగులవారైన యిద్దరు మనుష్యులను పిలిపించి మీరు పోయి.... యెరికోను చూడుడని వారితో చెప్పి .... రహస్యముగా పంపెను. వారు రాహాబను నొక వేశ్యయింట చేరి అక్కడదిగెను. యెహో 2 : 1

ఈ పట్టణము దీనిలో నున్నది యావత్తును యెహోవావలన శపింపబడెను. రాహాబను వేశ్య మనము పంపిన దూతలను దాచిపెట్టెను. గనుక ఆమెయు ఆమె యింట నున్న వారందరును మాత్రమే బ్రదుకుదురు. యెహో 6:17

(యెహో 6 : 25 కూడ చూడండి)

[హెబ్రీ 11 : 31, యాకో 2 : 25 లలో రాహాబు క్రియలను స్తుతించడం జరిగింది.]

ఇశ్రాయేలీయులందరికి సున్నతి చేసిన యెహోషువ

యెహోవా-రాతి కత్తులు చేయించుకొని మరల ఇశ్రాయేలీయులకు సున్నతి చేయించుమని యెహోషువాకు ఆజ్ఞాపింపగా యెహోషువ రాతి కత్తులు చేయించుకొని సున్నతిగిరి అను స్థలము దగ్గర ఇశ్రాయేలీయులకు సున్నతి చేయించెను, యెహోషువా సున్నతి చేయించుటకు హేతు వేమనగా, ఐగుప్తులోనుండి బయలు దేరిన వారందరిలో యుద్ధసన్నద్ధులైన పురుషులందరు ఐగుప్తుమార్గమున అరణ్యములో చనిపోయిరి. బయలు దేరిన పురుషులందరు సున్నతి పొందినవారే కాని ఐగుప్తులో నుంది బయలు దేరిన తరువాత అరణ్యమార్గమందు పుట్టిన వారిలో ఎవరును సున్నతి పొంది యుండలేదు. యెహోవా మనకు ఏ దేశమును యిచ్చెదనని వారి పితురులతో ప్రమాణము చేసెనో, పాలు తేనెలు ప్రవహించు ఆ దేశమును తాను వారికి చూపింపనని యెహోవా ప్రయాణము చేసి యుండెనుగనుక ఐగుప్తులో నుండి వచ్చిన ఆ యోధులందరు యెహోవా మాట వినకపోయినందున వారు నశించువరకు ఇశ్రాయేలీయులు నలువది సంవత్సరములు అరణ్యములో సంచ

ంచుచువచ్చిరి. అయన వారికి ప్రతిగా పుట్టించిన వారి కుమారులు సున్నతి పొంది యుండలేదు. గనుక వారికి సున్నతి చేయించెను. ఏలయనగా మార్గమున వారికి సున్నతి జరుగలేదు. కాబట్టి ఆ సమస్తజనము సున్నతి పొందుట తీరిన తరువాత తాము బాగుపడువరకు పాళెములోని తమ చోట్లనిలిచిరి. యెహో 5 : 2-8

## గిద్యోను భార్యలు, ఉపపత్ని

గిద్యోనుకు అనేక భార్యలున్నందున కడుపున కనిన డెబ్బది మంది కుమారులు అతనికుండెరి. షెకెములోనున్న అతని ఉపపత్నియు అతనికొక కుమారుని కనగా గిద్యోను వానికి అబీమెలెకను పేరుపెట్టెను.

న్యాయా 8 : 30, 31

## దేవదూతలు మానవస్త్రీలకు గర్భం చేయుడం

యెహోవా దూత ఆ స్త్రీకి ప్రత్యక్షమై ఇదిగో నీవు గొడ్రాలవు, నీకు కానుపు లేకపోయెను, అయితే నీవు గర్భవతివై కుమారుని కందువు .... ఆ స్త్రీ తన పెనిమిటి యొద్దకు వచ్చి—దైవ జనుడొకడు నా యొద్దకువచ్చెను: అతని రూపము దేవదూత రూపమును పోలినదై మిక్కిలి భీకరముగా ఉండెను. అతడు ఎక్కడనుండి వచ్చెనో నేనడుగలేదు: అతడు తన పేరు నాతో చెప్పలేదు .... దేవుడు మానోహ ప్రార్థన నాలకించెను. గనుక, ఆ స్త్రీ పొలములో కూర్చుండగా దేవుని దూత ఆమెను దర్శించెను .... తరువాత ఆ స్త్రీ కుమారుని కని అతనికి సమ్సోను అను పేరుపెట్టెను. న్యాయా 13 ; 3, 6, 9, 24.

ఎఫ్రాయిము మన్యమందు....ఒకడుండెను, అతని పేరు ఎల్కానా ...అతనికి ఇద్దరు భార్యలుండిరి. వీరిలో ఒకదానిపేరు హన్నా రెండవ దానిపేరు పెనిన్నా పెనిన్నాకు పిల్లలు కలిగిరి గాని హన్నాకు పిల్లలు లేక పోయిరి .... అంతట ఏలీ- నీవు క్షేమముగా వెళ్ళుము, ఇశ్రాయేలు దేవునితో నీవు చేసికొనిన మనవిని ఆయన దయచేయును గాక అని ఆమెతో చెప్పగా .... హన్నా గర్భము ధరించి దినములు నిండినప్పుడు ఒక కుమారుని కని-నేను యెహోవాకు మ్రొక్కుకొని వీనిని అడిగి తినను కొని వానికి సమూయేలను పేరుపెట్టెను.

1 సమూ 1 1, 2, 17, 20.

అతడు (ఎలీషా) అక్కడికి ఒకానొక దినమున వచ్చి ఆగదిలో చొచ్చి అక్కడపరుండెను .... ఆమెవచ్చి ద్వారమందు నిలువగా ఎలీషా—మరుసటి యేట ఈ రుతువున నీ కౌగిత కుమారుడుండునని ఆమెతోఅనెను. ఆమెమాట విని-దైవ జనుడైన నా యేలినవాడా, ఆ లాగుపలుకవద్దు, నీ దాసురాలనైననాతో అబద్ధమాడ వద్దనెను. పిమ్మట ఆస్త్రీ గర్భవతియై మరుసటియేట ఎలీషా తనతో చెప్పిన కాల మున కుమారుని కనెను. 2 రాజు 4 : 11, 16, 17.

## ఉపపత్నిని గుంపుకప్పగించిన లేవీయుడు

ఆ ఊరివారిలో కొందరు పోకిరులు ఆ యిల్లు చుట్టుకొని తలుపుకొట్టి నీ యింటికివచ్చిన మనుష్యుని మేము ఎరుగునట్లు అతని బయటికి తెమ్మని యింటి యజమానుడైన ఆ ముసలి వానితో అనగా యింటి యజమానుడైన ఆ మనుష్యుడు వారి యొద్దకు బయలు వెళ్ళి-నా సహోదరులారా, అదికూడదు, అట్టి దుష్కార్యము చేయకూడదు, ఈ మనుష్యుడు నా యింటికివచ్చెను. గనుక మీరు ఈ వెట్టిపని చేయకుడి ఇదిగో కన్యకయైన నా కుమార్తెయును ఆ మనుష్యుని ఉపపత్నియు నున్నారు. నేను వారిని బయటికి తీసికొని వచ్చెదను, మీరు వారిని నీచపరచి మీ యిష్టప్రకారముగా వారి యెడల జరిగింపవచ్చును గాని ఈ మనుష్యుని యెడల ఈ వెట్టిపని చేయకుడని వారితో చెప్పెను గాని అతని మాట వినుటకు వారికి మనస్సు లేక పోయెను గనుక ఆ మనుష్యుడు బయట నున్నవారి యొద్దకు తన ఉపపత్నిని తీసికొనిపోగా వారు ఆమెను కూడి ఉదయమువరకు ఆ రాత్రి అంతయు ఆమెను చెరుపుచుండిరి. తెల్లవారగా వారు ఆమెను విడిచివెళ్ళిరి: ప్రాతఃకాలమున ఆ స్త్రీ పిచ్చివెలుగు వచ్చువరకు తన యజమానుడున్న ఆ మనుష్యుని యింటి ద్వారమున పడియుండెను. ఉదయమున ఆమె యజమానుడు లేచి యింటి తలుపులను తీసి తన త్రోవను వెళ్ళుటకు బయలుదేరగా అతని ఉపపత్నియైన ఆ స్త్రీ యింటిద్వారము నొద్దపడి చేతులు గడపమీద చాపియుండెను. అతడు-లెమ్ము, వెళ్ళుదమనగా ఆమె ప్రత్యుత్తరమీయకుండెను, గనుక అతడు గాడిదమీద ఆమెను ఉంచి లేచి తన చోటికి ప్రయాణము చేయసాగెను. అతడు తన యింటికి వచ్చినప్పుడు కత్తి పట్టు కొని తన ఉపపత్నిని తీసికొని, ఆమెను ఆమె కీళ్ళ ప్రకారము పండ్రెండు ముక్క లుగా కోసి. ఇశ్రాయేలీయుల దిక్కులన్నిటికి ఆ ముక్కలను పంపెను, అప్పుడు దాని చూచిన వారందరు....ఇది మనస్సునకు తెచ్చుకొని దీనిని బట్టి ఆలోచన చేసి

దీనిని గూర్చి మాటలాడుడని ఒకరితో నొకరు చెప్పుకొనిరి.

న్యాయా 19 : 22-30

## నాలుగువందల మంది కన్యల అపహరణ

మీరు చేయ వలసిన దేమనగా, ప్రతి పురుషుని పురుష సంయోగము నెరిగిన పతి స్త్రీని నశింపజేయవలెనని చెప్పిరి, యాబేష్గిలాదు నివాసులలో పురుష సంయోగము నెరుగని నాలుగువందల మంది కన్యలైన స్త్రీలు దొరుకగా కనాను దేశమందలి షిలోహులోనున్న సేనలోనికి వారిని తీసికొనివచ్చిరి. ఆ సర్వసమాజము రిమ్మోను కొండలో నున్న బెన్యామీనీయులతో మాటలాడుటకును వారిని సమాధాన పరచుటకును వర్తమానము పంపగా ఆవేళను బెన్యామీనీయులు తిరిగివచ్చిరి. అప్పుడు వారు తాము యాబేష్గిలాదు స్త్రీలలో బ్రదుకనిచ్చిన వారిని వారికిచ్చి పెండ్లి చేసిరి. న్యాయా 21 : 11-14.

## పండుగ సమయంలో స్త్రీల అపహరణ

వారు బెన్యామీనీయులతో .... బేతేలు నుండి షెకెమునకు పోవు రాజమార్గమునకు తూర్పున న్న లెబోనాకు దక్షిణ దిక్కున యెహోవాకు పండుగ ఏటేటా షిలోహులో జరుగునని చెప్పి బెన్యామీనీయులను చూచి—మీరు వెళ్ళి ద్రాక్ష తోటలలో నుండి బయలుదేరివచ్చి పెండ్లి చేసికొనుటకు ప్రతివాడును షిలోహు స్త్రీలలో ఒకదాని పట్టుకొని బెన్యామీనీయుల దేశమునకు పారిపోవుడి తరువాత వారి తండ్రులైనను సహోదరులైనను వాదించుటకు మీవద్దకు వచ్చిన యెడల మేము- ఆ యుద్ధమును బట్టి వారిలో ప్రతి వానికిని పెండ్లికి స్త్రీ దొరకలేదు గనుక ఈ స్త్రీలను దయచేసి మా కియ్యుడి. ఈ సమయమున వారికిచ్చిన యెడల మీరు అపరాధులగుదురు గనుక మా కిచ్చినట్లుగా ఇయ్యుడని వారితో చెప్పెదమనిరి: కాగా బెన్యామీనీయులు అట్లు చేసి తమ లెక్క చొప్పున నాట్యమాడిన వారిలో నుండి స్త్రీలను పట్టుకొని వారిని తీసికొని పోయి తమ స్వాస్థ్యమునకు వెళ్ళి పట్టణములను కట్టి వాటిలో నివసించిరి. న్యాయా 21 : 19-23

## ఏలీకుమారుల ప్రవర్తన

ఏలీ బహు వృద్ధుడాయెను. ఇశ్రాయేలీయులకు తన కుమారులు చేసిన

కార్యములన్నియు, వారు ప్రత్యక్షపు గుడారము యొక్క ద్వారము దగ్గరకు సేవ చేయుటకు వచ్చిన స్త్రీలతో శయనించుటయను మాట చెవిని పడగా వారినిపిలిచెను
1 సమూ 2 : 22

దేవుడి కసి

యెహోవా హస్తము అష్డోదు వారిమీద భారముగా ఉండెను. అష్డోదువారిని దాని సరిహద్దులలో నున్నవారిని ఆయన గడ్డల రోగముతో మొత్తి వారిని హతము చేయగా .... అయితేవారు అష్డోదు నుండి గాతునకు దానిని మోసికొని పోయిన తరువాత యెహోవాహస్తము ఆ పట్టణపు పెద్దలకు పిన్నలకు రహస్య స్థానములలో గడ్డలులేపి వారిని మొత్తి గొప్ప నాశనము జేసెను....చావక మిగిలి యున్నవారు గడ్డల రోగముచేత మొత్తబడిరి, ఆ పట్టణస్థుల కేకలు ఆకాశము వరకువినబడెను.
1 సమూ 5 : 6, 9, 12.

నూరు ముందోళ్ళ కట్నం

అందుకు సౌలు ఫిలిష్తీయుల చేత దావీదును పడగొట్టవలెనన్న తాత్పర్యము గలవాడై-రాజు ఓలిని కోరకరాజు శత్రువుల మీద పగతీర్చుకొనవలెనని ఫిలిష్తీయుల నూరు ముందోళ్ళు * కోరుచున్నాడని దావీదుతో చెప్పుడనెను .... గడువు దాటకముందే లేచి తనవారితో పోయి ఫిలిష్తీయులలో రెండు వందల మందిని హతము చేసి వారి ముందోళ్ళు తీసికొని వచ్చి రాజునకు అల్లుడగుటకై కావలసిన లెక్క పూర్తిచేసి అప్పగింపగా సౌలు తన కుమార్తెయైన మీకాలును అతనికిచ్చి పెండ్లిచేసెను. 1 సమూ 18 : 25, 27

సౌలు దిగంబరత్వం

అతడు (సౌలు) రామాదగ్గర నున్న నాయోతునకు రాగా దేవుని ఆత్మ అతని మీదికి వచ్చెను. గనుక అతడు ప్రయాణము చేయుచు రామా దగ్గర నున్న నాయోతునకు వచ్చువరకు ప్రకటించుచుండెను. మరియు అతడు తన వస్త్రములను తీసివేసి ఆనాటి రాత్రింబగళ్ళు సమూయేలు ఎదుటనే ప్రకటించుచు, పై బట్ట లేనివాడై పడియుండెను. 1 సమూ 19 : 23, 24.

---

ముందోలు అనగా పురుషాంగము యొక్కముందు చర్మం అనిఅర్థం-అను

## దావీదుకు భార్యల్ని, ఉపపత్నుల్ని యిచ్చిన దేవుడు

దావీదు హెబ్రోను నుండి వచ్చిన తరువాత యెరూషలేములోనుండి యింక అనేకమైన ఉపపత్నులను భార్యలను చేసికొనగా దావీదునకు ఇంకను పెక్కమంది కుమారులును కుమార్తెలును పుట్టిరి. 2 సమూ 5 : 13

నీయజమానుని స్త్రీల నీ కౌగిట చేర్చి ఇశ్రాయేలు వారిని తన యూదా వారిని నీ కప్పగించితిని ఇది చాలదని నీవనుకొనిన యెడల నేను మరి ఎక్కువగా నీకిచ్చి యుందును. 2 సమూ 12 ; 8.

దావీదు యెరూషలేములోని తన నగరికి వచ్చి, తన యింటికి తాను కాపుగా నుంచిన తన ఉపపత్నులైన పదిమంది స్త్రీలను తీసికొని వారిని కావలిలో వుంచి వారిని పోషించుచుండెనుగాని వారి యొద్దకు పోకుండెను. వారు కావలియందుంచబడిన వారై బ్రతికినంతకాలము విధవరాండ్రవలె ఉండిరి.2 సమూ 20:3

## మందసం ముందు దావీదు అసభ్య నాట్యం

యెహోవా మందసమును మోయువారు ఆరేసి అడుగులు సాగగా ఎద్దు ఒకటియు క్రొవ్విన దూడ ఒకటియు వధింపబడెను, దావీదు నారతో నేయ బడిన, ఏఫోదును ధరించినవాడై శక్తికొలది యెహోవా సన్నిధిని నాట్యమాడు చుండెను. ఈలాగున దావీదును ఇశ్రాయేలీయులందరును ఆర్భాటముతోను బాకా నాదములతోను యెహోవామందసమును తీసికొని వచ్చిరియెహోవా మందసము దావీదు పురమునకు రాగా సౌలు కుమార్తెయగు మీకాలు కిటికీలోనుండి చూచి, యెహోవా సన్నిధిని గంతులువేయుచు నాట్యమాడుచున్న దావీదును కనుగొని, తన మనస్సులో అతని హీనపరచెను....తన యింటివారిని దీవించుటకు దావీదు తిరిగిరాగా సౌలు కుమార్తెయగు మీకాలు దావీదును ఎదుర్కొన బయలుదేరివచ్చి-హీనస్థితిగల పనికత్తెలు చూచుచుండగా వ్యర్థుడొకడు తన బట్టలను విప్పివేసినట్టుగా ఇశ్రాయేలీయులకు రాజైన నీవు నేడు బట్టలను తీసివేసి ఎంత ఘనముగా కనపడితివని అపహాస్యము చేసినందున దావీదు-నీతండ్రి అతని సంతతిని విసర్జించి ఇశ్రాయేలీయులను తన జనులమీద నన్ను అధిపతిగా నిర్ణయించుటకై నన్ను ఏర్పరచుకొనిన యెహోవా సన్నిధిని నేనాలాగు చేసితిని, యెహోవా సన్నిధిని నేను ఆట ఆడితిని. ఇంతకంటె

మరి యెక్కువగా నేను తృణీకరింపబడి నాదృష్టికి నేను అల్పుడనై నీవు చెప్పిన పనికత్తెల దృష్టికి ఘనుడనగుదునని మీకాలుతో అనెను. మరణము వరకు సౌలు కుమార్తెయగు మీకాలు పిల్లలను కనకయుండెను.

2 సమూ 6 : 14-16, 20-23

## దావీదు వ్యభిచారం

ఒకానొకదినమున ప్రొద్దు గ్రుంకు వేళ దావీదు పడక మీద నుండి లేచి రాజనగరి మిద్దెమీద నడచుచు పై నుండి చూచుచుండగా స్నానము చేయు ఒకస్త్రీ కనబడెను. ఆమె బహుసౌందర్యవతియై యుండుట చూచి దావీదు దాని సమాచారము తెలిసికొనుటకై యొక దూతను పంపెను. అతడు వచ్చి-ఆమెఏలీయాము కుమార్తెయు హిత్తీయుడగు ఊరియాకు భార్యయునైన బత్షెబ అని తెలియజేయగా దావీదు దూతలచేత ఆమెను పిలువనంపెను. ఆమె అతని యొద్దకురాగా అతడు ఆమెతో శయనించెను. కలిగిన అపవిత్రత పోగొట్టుకొని ఆమె తన యింటికి మరల వచ్చె . ఆస్త్రీ గర్భవతియై నేను గర్భవతినైతినని దావీదునకు వర్తమానము పంపగా దావీదు హిత్తీయుడగు ఊరియాను నా యొద్దకు పంపుమని దూతద్వారా యోవాబునకు ఆజ్ఞయిచ్చెను. ఊరియా దావీదు నొద్దకు రాగా దావీదు యోవాబు యోగక్షేమమును జనుల యోగక్షేమమును యుద్ధసమాచారమును అడిగెను, తరువాత దావీదు—యింటికి పోయి శ్రమ తీర్చుకొనుమని ఊరియాకు సెలవియ్యగా .... ఊరియా తన యింటికిపోలేదను మాట దావీదునకు వినబడినప్పుడు దావీదు ఊరియాను పిలిపించి-నీవు ప్రయాణము చేసివచ్చితివిగదా, యింటికి వెళ్ళకపోతి వేమని యడుగగా ఊరియా-మందసమును ఇశ్రాయేలు వారును యూదావారును గుడారములలో నివసించుచుండగను, న్యాయాధిపతియగు యోవాబును నా యేలినవాడవగు నీ సేవకులును బయట దండులో నుండగను, భోజన పానములు చేయుటకును నా భార్య యొద్ద పరుండుటకును నేనుయింటికి పోవుదునా:నీ ప్రాణముతోడు నేనాలాగు చేయువాడను కానని దావీదుతో అనెను .... దావీదు అతనిని భోజనమునకు పిలిపించెను. అతడు బాగుగాతిని త్రాగిన తరువాత దావీదు అతని మత్తునిగా చేసెను. సాయంత్రమున అతడు బయలు వెళ్ళి తన యేలినవాని సేవకుల మధ్య పడకమీద పండుకొనెను. ఉదయమున దావీదు-యుద్ధము మోపుగా జరుగుచున్న చోట ఊరియాను ముందుపెట్టి అతడు కొట్టబడి హతమగునట్లు నీవు అతని యొద్ద

నుండి వెళ్ళిపొమ్మని యోవాబునకు ఉత్తరము వ్రాయించి ఊరియాచేత పంపించెను. యోవాబు పట్టణమును ముట్టడి వేయుచుండగా, ధైర్యవంతులుండు స్థలమును గుర్తించి ఆ స్థలమునకు ఊరియాను పంపెను. ఆ పట్టణపు వారు బయలుదేరి యోవాబుతో యుద్ధమునకు రాగా దావీదు సేవకులలో కొందరు కూలిరి, హిత్తీయుడగు ఊరియాయును హతమాయెను. కాబట్టి యోవాబు .... తమరి సేవకుడగు ఊరియాయు హతమాయెనని చెప్పుమని బోధించి దూతను పంపెను. దూత పోయి యోవాబు పంపిన వర్తమానమంతయు దావీదునకు తెలియజేసెను .... ఊరియా భార్య తన భర్తయగు ఊరియా హతమైన సంగతి విని తన భర్త కొరకు అంగలార్చెను. అంగలార్పుకాలము తీరిన తరువాత దావీదు దూతలను పంపి ఆమెను తన నగరికి తెప్పించుకొనగా ఆమె అతనికి భార్యయయి అతనికొక కుమారుని కనెను. 2 సమూ 11 : 2-27.

[దావీదు అవినీతిపరుడైనా పవిత్రుడే. 2 సమూ 11 : 4 ప్రకారం బత్షెబ దావీదుతో వ్యభిచరించినా ఆమె తనకు కలిగిన అపవిత్రతను పోగొట్టుకున్నదని బైబిలు చెబుతున్నది.]

బహిరంగ మానభంగానికి దేవుడి వత్తాసు

యెహోవానగు నేను సెలవిచ్చునదేమనగా— నీ యింటివారి మూలముననే నేను నీకు అపాయము పుట్టింతును; నీవు చూచుచుండగా నేను నీ భార్యలను తీసి నీ చేరువ వాని కప్పగించెదను. పగటియందు వాడు వారితో శయనించును. నీవు ఈ కార్యము రహస్యముగా చేసితివిగాని ఇశ్రాయేలీయులందరు చూచుచుండగా పగటియందే నేను చెప్పిన దానిని చేయింతును అనెను.

2 సమూ 12 : 11, 12.

అహీతోపెలు— నీ తండ్రిచేత యింటికి కావలి యుంచబడిన ఉపపత్నుల యొద్దకు నీవు పోయిన యెడల నీవు నీ తండ్రికి అసహ్యుడవైతివని ఇశ్రాయేలీయులందరు తెలిసికొందురు. అప్పుడు నీ పక్షముననున్న వారందరు ధైర్యము తెచ్చుకొందురని చెప్పెను. కాబట్టి మేడమీదవారు అబ్షాలోమునకు గుడారము వేయగా ఇశ్రాయేలీయులకందరికి తెలియునట్లుగా అతడు తన తండ్రి ఉపపత్నులను

కూడెను. ఆ దినములలో అహీతోపెలు చెప్పిన యే యాలోచనయైనను ఒకడు దేవుని యొద్ద విచారణచేసి పొందిన ఆలోచనమైనట్టుగా ఉండెను.

2 సమూ 16 : 21-23.

## అమ్నోను తన సోదరిని మానభంగం చేయడం

తరువాత దావీదు కుమారుడగు అబ్షాలోమునకు తామారను నొక సుందరవతియగు సహోదరి యుండగా దావీదు కుమారుడగు అమ్నోను ఆమెను మోహించెను. తామారు కన్యయైనందున ఆమెకు ఏమి చేయవలెనన్నను దుర్లభమని అమ్నోను గ్రహించి చింతాక్రాంతుడై తన చెల్లెలైన తామారును బట్టి చిక్కిపోయెను. అమ్నోనుకు మిత్రుడొకడుండెను. .... అతనిపేరు యెహోనాదాబు.... బహుకపటము గల .... అతడు—రాజకుమారుడవైన నీవు నానాటికి చిక్కిపోవుటకు హేతువేమి ? సంగతి నాకు తెలియజెప్పవా అని అమ్నోనుతో అనగా అమ్నోను- నా తమ్ముడగు అబ్షాలోము సహోదరియైన తామారును నేను మోహించియున్నానని అతనితో అనెను. యెహోనాదాబు- నీవు రోగివైనట్టు వేషము వేసికొని నీ మంచముమీద పండుకొని యుండుము. నీ తండ్రి నిన్ను చూచుటకు వచ్చినప్పుడు నీవు- నా చెల్లెలైన తామారుచేత సిద్ధపరచబడిన భోజనము నేను భుజించునట్లు ఆమె వచ్చి నేను చూచుచుండగా దానిని సిద్ధముచేసి నాకు పెట్టునట్లు సెలవిమ్మని అడుగుమని అతనికి బోధింపగా అమ్నోను పడకమీద పండుకొనెను. అమ్నోను కాయిలాపడెనని రాజు అతని చూడవచ్చినప్పుడు అమ్నోను- నా చెల్లెలగు తామారు చేతివంటకము నేను భుజించునట్లు ఆమె వచ్చి నేను చూచుచుండగా నా కొరకు రెండు అప్పములు చేయుటకు సెలవిమ్మని రాజుతో మనవిచేయగా దావీదు- నీ అన్నయగు అమ్నోను యింటికిపోయి అతని కొరకు భోజనము సిద్ధము చేయుమని తామారు యింటికి వర్తమానము పంపెను. కాబట్టి తామారు తన అన్నయగు అమ్నోను ఇంటికి పోయెను. అతడు పండుకొనియుండగా ఆమె పిండి తీసికొని కలిపి అతని యెదుట అప్పములు చేసి వాటిని కాల్చి బొరుసు పట్టుకొని అతనికి వడ్డింపగా అతడు- నాకు వద్దని చెప్పి- ఉన్నవారందరు నా యొద్దనుండి అవతలకు పొండనెను. వారందరు బయటకు పోయిన తరువాతనే అమ్నోను- నీ చేతి వంటకము నేను భుజించునట్లు దానిని గదిలోనికి తెమ్మనగా, తామారు తాను చేసిన అప్పములను తీసికొని గదిలోపల న్న తన అన్నయగు అమ్నోను నొద్దకు

వచ్చెను. అయితే అతడు భుజింపవలెనని ఆమె వాటిని తీసికొని వచ్చినప్పుడు అతడు ఆమెను పట్టుకొని- నా చెల్లీ రమ్ము, నాతో శయనింపుము అని చెప్పగా ఆమె- నా అన్నా నన్ను అవమాన పరచకుము, ఈలాగుచేయుట ఇశ్రాయేలీయులకు తగదు, ఇట్టి జారకార్యము నీవు చేయవద్దు, నా యవమానము నేనెక్కడ దాచుకొందును ? నీవు ఇశ్రాయేలీయులలో దుర్మార్గుడవగుదువు, అయితే యిందును గూర్చి రాజుతో మాటలాడుము; అతడు నన్ను నీకియ్యకపోడు అని చెప్పినను అతడు ఆమె మాట వినక ఆమెను బలవంతము చేసి అవమానపరచి ఆమెతో శయనించెను. అమ్నోను ఈలాగు చేసిన తరువాత ఆమె యెడల అత్యధికమైన ద్వేషముపుట్టి అదివరకు ఆమెను ప్రేమించినంతకంటె అతడు మరియెక్కువగా ఆమెను ద్వేషించి లేచిపొమ్మని ఆమెతో చెప్పగా ఆమె- నన్ను బయటకు తోసి వేయుట వలన నాకు నీవిప్పుడు చేసిన కీడుకంటె మరియెక్కువ కీడుచేయకుమని చెప్పినను అతడు ఆమె మాటవినక తన పనివారిలో ఒకని పిలిచి- దీనిని నాయొద్ద నుండి వెళ్ళగొట్టి తలుపు గడియ వేయమని చెప్పెను .... పనివాడు ఆమెను బయటకు వెళ్ళగొట్టి మరల రాకుండునట్లు తలుపు గడియవేసెను. అప్పుడు తామారు నెత్తిమీద బుగ్గిపోసికొని తాను కట్టుకొనిన వివిధ వర్ణములు గల చీరను చింపి నెత్తిమీద చెయ్యిపెట్టుకొని యేడ్చుచుపోగా ఆమె అన్నయగు అబ్షాలోము ఆమెను చూచి- నీ అన్నయగు అమ్నోను నిన్నుకూడినాడుగదా ? నా చెల్లీ నీవు ఊరకుండుము, అతడు నీ అన్నేగదా, ఇందును గూర్చి చింతపడవద్దనెను. కావున తామారు చెరుపబడినదై తన అన్నయగు అబ్షాలోము యింటనుండెను. ఈ సంగతి రాజగు దావీదునకు వినబడినప్పుడు అతడు బహురౌద్రము తెచ్చుకొనెను. అబ్షాలోము తన అన్నయగు అమ్నోనుతో మంచిచెడ్డ లేమియు మాటలాడక ఊరకుండెను. గాని, తన సహోదరియగు తామారును బలవంతము చేసినందుకై అతని మీద పగయుంచెను. 2 సమూ 13 : 1-22.

ముసలిరాజుకు పడుచు పెళ్ళాం !

కాబట్టి వారు— మా యేలిన వాడవును రాజవునగు నీకొరకు తగిన చిన్నదాని వెదకుటమంచిది, ఆమె రాజైన నీ సముఖమందుండి నిన్ను ఆదరించి వెట్ట కలుగుటకు నీ కౌగిటిలో పండుకొనును అని చెప్పెను. 1 రాజు 1 : 2.

సొలొమోను జనానా

రాజైన సొలొమోను ఫరో కుమార్తెనుగాక ఆ జనులలో యింక అనేక మంది పరస్త్రీలను మోహించి కామాతురత గలవాడై వారిని ఉంచుకొనుచువచ్చెను. అతనికి ఏడు వందలమంది రాజకుమార్తెలైన భార్యలును మూడు వందలమంది ఉపపత్నులను కలిగియుండిరి. అతని భార్యలు అతని హృదయమును త్రిప్పి వేసిరి. 1 రాజు 11 : 1-3.

అతడు (సొలొమోను)సమస్తమైనవారి కంటెను జ్ఞానవంతుడై యుండెను.
1 రాజు 4 : 31.

విజాతి వివాహం నిషేధం

మేము దేశమందుండు అన్యజనములలోని స్త్రీలను పెండ్లి చేసికొని మా దేవుని దృష్టికి పాపము చేసితిమి, అయితే ఈ విషయములో ఇశ్రాయేలీయులు తమ నడవడి దిద్దుకొందురను నిరీక్షణ కద్దు .... దేవుడైన యెహోవా యెదుట మీ పాపమును ఒప్పుకొని, ఆయన చిత్తాను సారముగా నడుచుకొనుటకు సిద్ధపడి, దేశపు జనులను అన్యస్త్రీలను విసర్జించి మిమ్మును మీరు ప్రత్యేక పరచుకొని యుండుడి .... మొదటి నెల మొదటి దినమున అన్యస్త్రీలను పెండ్లి చేసికొనిన వారందరి సంగతి వారు సమాప్తము చేసిరి. ఎజ్రా 10 : 2, 11, 17.

ఆ దినములలో అష్డోదు అమ్మోను మోయాబు సంబంధులైన స్త్రీలను వివాహము చేసికొనిన కొందరు యూదులు నాకు కనబడిరి. వారి కుమారులలో సగముమంది అష్డోదు భాష మాటలాడువారు. వారు ఆయా భాషలు మాటలాడు వారుగాని యూదుల భాష వారిలో ఎవరికిని రాదు. అంతట నేను వారితో వాదించి వారిని శపించి కొందరినికొట్టి వారి తల వెండ్రుకలను పెరికివేసి- మీరు వారి కుమారులకు మీ కుమార్తెలను ఇయ్యకయు, మీ కుమారులకైనను మీకైనను వారి కుమార్తెలను పుచ్చుకొనకయు ఉండవలెనని వారిచేత దేవుని పేరట ప్రమాణము చేయించి- ఇట్టి కార్యములు జరిగించి ఇశ్రాయేలీయుల రాజైన సొలొమోను పాపము చేయలేదా ? అనేక జనములలో అతనివంటి రాజు లేక పోయినను అతడు తన దేవుని చేత ప్రేమింపబడినవాడై ఇశ్రాయేలీయులందరి మీద రాజుగా నియమింపబడినను అన్యస్త్రీలు అతనిచేత సహా పాపము చేయించ

లేదా ? కాగా యింత గొప్పకీడు చేయునట్లును, మన దేవునికి విరోధముగా పాపము చేయునట్లును అన్యస్త్రీలను వివాహము చేసికొనిన మీవంటివారి మాటలను మేము ఆలకింపవచ్చునా ? అని అడిగితిని. ప్రధాన యాజకుడును ఎల్యాషీబు కుమారుడునైన యోయాదా కుమారులలో ఒకడు హోరోనీయుడైన సన్బల్లటునకు అల్లుడాయెను. దానిని బట్టి నేను అతని నా యొద్దనుండి తరిమితిని. నాదేవా, వారు యాజక ధర్మమును, యాజక ధర్మపు నిబంధనను, లేవీయుల నిబంధనను అపవిత్ర పరచిరి గనుక వారిని జ్ఞాపకముంచుకొనుము. ఈలాగున వారు ఏ పరదేశములోను కలియకుండ వారిని పవిత్ర పరచి, ప్రతి యాజకుడును, ప్రతి లేవీయుడును విధి ప్రకారముగా సేవచేయునట్లు నియమించితిని.

నెహె 13 : 23-30.

## బహుపత్నీత్వ - ఉపపత్నీత్వం

రాజు పరిచారకులు ఇట్లనిరి— అందమైన కన్యకలను రాజుకొరకు వెదక నగును .... రాజైన అహష్వేరోషు నొద్దకు వెళ్ళుటకు ఒక్కొక్క చిన్నదానికి వంతు వచ్చినప్పుడు ఒక్కొక్క చిన్నది రాజు నొద్దకు .... పోవుచుండెను .... మరియు అంతఃపురములో నుండి రాజు ఇంటిలోనికి వెళ్ళవలసిన సమయమందు ఆమె యేమేమి కోరునో అది అట్టి స్త్రీకి ఇయ్యబడుట కద్దు. సాయంత్రమందు ఆమె లోపలికి వెళ్ళి మరుదినము ఉపపత్నులను కాయు రాజుయొక్క షండుడైన షయష్గజు అను అతనివశములో నున్న రెండవ అంతఃపురమునకు తిరిగివచ్చును. ఆమెయందు రాజు సంతోషించి ఆమెను పేరుపెట్టి పిలిచితేనే గాని ఆమె రాజు నొద్దకు మరల వెళ్ళకుండెను. ఎస్తే 2 : 2, 12-14.

నగరు వనములో నుండి ద్రాక్షారసపు విందు స్థలమునకు రాజు తిరిగిరాగా ఎస్తేరు కూర్చుండియున్న శయ్యమీద హామాను బడియుండుట చూచి- వీడు ఇంటిలో నా సముఖము ఎదుటనే రాణిని బలవంతము చేయునా ! అని చెప్పెను. ఆ మాట రాజు నోట రాగానే బంటులు హామాను ముఖమునకు ముసుకు వేసిరి.

ఎస్తే 7 : 8.

## పరమ గీతంలో అంగాంగ శృంగార వర్ణన

నా ప్రియుడు నా రొమ్ము నుండు గోపరసమంత సువాసన గలవాడు.... నా

ప్రియుడా, నీవు సుందరుడవు, అతి మనోహరుడవు. మన శయన స్థానము పచ్చనిచోటు. పర 1 : 13, 16

అతడు నన్ను విందుశాలకు తోడుకొని పోయెను. నా మీద ప్రేమను ధ్వజముగా ఎత్తెను. ప్రేమాతిశయముచేత నేను మూర్ఛిల్లు చున్నాను. ద్రాక్షపండ్ల యడలు పెట్టి నన్ను బలపరచుడి. జల్దరుపండ్లుపెట్టి నన్నాదరించుడి. అతని యెడమ చెయ్యి నా తలక్రింద నున్నది. కుడిచేత అతడు నన్ను కౌగిలించుచున్నాడు. యెరూషలేము కుమార్తెలారా, పొలములోని యిఱ్ఱులను బట్టియు లేళ్ళను బట్టియు మీచేత ప్రమాణము చేయించుకొని ప్రేమకు యిష్టమగువరకు మీరులేపకయు కలత పరచకయు నుండునని మిమ్మును బతిమాలుకొనుచున్నాము. పర 2 : 4-7.

రాత్రివేళ పరుండి యుండినేను నా ప్రాణప్రియుని వెదకితిని. వెదకినను అతడు కనబడక యుండెను. నేనిప్పుడే లేచెదను. పట్టణము వెంబడిపోయి వెదకుదును. సంతవీధులలోను రాజవీధులలోను తిరుగుదును. నా ప్రాణప్రియుని వెదకుదును అని నేననుకొంటిని. నేను వెదకినను అతడు కనబడలేదు. పట్టణము నందు సంచరించు కావలివారు నాకెదురు పడగా మీరు నా ప్రాణప్రియుని చూచితిరా ? అని నేనడిగితిని. నేను వారిని విడిచికొంచెము దూరముపోగా నా ప్రాణప్రియుడు నాకెదురు పడెను. వదలిపెట్టక నేనతని పట్టుకొంటిని. నా తల్లి యింటి కతని తోడుకొని వచ్చితిని. యెరూషలేము కుమార్తెలారా, పొలములోని యిఱ్ఱులను బట్టియు లేళ్ళను బట్టియు మీ చేత ప్రమాణము చేయించుకొని లేచుటకు ప్రేమకు యిష్టమగు వరకు మీరు పకయు కలత పరచకయు నుండుడని నేను మిమ్మును బతిమాలుకొనుచున్నాను. పర 3 : 1-5.

నీ యిరుకుచములు ఒక జింక పిల్లలయి తామరలో మేయు కవలను పోలి యున్నవి. పర 4 : 5.

నా సహోదరీ, నా ప్రియురాలా, నా పావురమా, నిష్కళంకురాలా ఆలకింపుము. నా తల మంచుకు తడిసినది. నా వెంట్రుకలు రాత్రి కురియు చినుకులకు తడిసినవి. నాకు తలుపుతీయుమనుచు నా ప్రియుడు వాకిలి తట్టు చున్నాడు. నేను వస్త్రము తీసివేసితిని. నేను మరల దాని ధరింపనేల ? నా పాదములు కడుగుకొంటిని. నేను మరల వాటిని మురికిచేయనేల ? తలుపు

సందులో నా ప్రియుడు చెయ్యియుంచగా నా అంతరంగము అతని యెడల జాలి గొనెను. నా ప్రియునికి తలుపుతీయ లేచితిని. నా చేతులనుండియు నా వ్రేళ్ళ నుండియు జటామాంసి గడియలమీద స్రవించెను .... అతని కరములు తార్షీషు రత్న భూషితమైన స్వర్ణగోళమువలె ఉన్నవి. అతని కాయము నీలరత్న ఖచిత మైన విచిత్రమగు దంతపు పనిగా కనబడుచున్నది. అతని కాళ్ళు మేలిమి బంగారు మట్లయందు నిలిపిన చలువరాతి స్తంభములవలె ఉన్నవి. అతని పై ఖరి లెబానోను పర్వత తుల్యము, అది దేవదారు వృక్షములంత ప్రసిద్ధము.

పర 5 : 2-5, 14, 15.

నీ పాదరక్షలతో నీవెంత అందముగా నడచుచున్నావు ? నీ ఊరువులు శిల్పకారి చేసిన ఆభరణ సూత్రములవలె ఆడుచున్నవి. నీ నాభి దేశము మండలా కార కలశము. సమ్మిశ్రిత ద్రాక్షారసము దాని యందు వెలితిపడకుండునుగాక. నీ గాత్రము పద్మాలంకృత గోధుమరాశి. నీ యిరు కుచములు జింక పిల్లలయి తామరలో మేయు ఒక కవలను పోలియున్నవి .... నా ప్రియురాలా, ఆనంద కరమైన వాటిలో నీవు అతి సుందరమైనదానవు. అతి మనోహరమైనదానవు. నీవు తాళ వృక్షమంత తిన్ననిదానవు. నీ కుచములు గెలలవలె నున్నవి. తాళ వృక్షము నెక్కుదననుకొంటిని. దాని శాఖలను పట్టుకొందునను కొంటిని. నీ కుచములు ద్రాక్షగెలలవలె నున్నవి. నీ శ్వాసవాసన జల్దరు ఫలసువాసనవలె నున్నది. నీ నోరు శ్రేష్ఠ ద్రాక్షారసమువలె నున్నది. ఆ శ్రేష్ఠ ద్రాక్షారసము నా ప్రియునికి మధురపానీయము. పర 7 : 1-3, 6-9.

అతని యెడమచెయ్యి నా తలక్రింద నున్నది. అతనికి కుడిచెయ్యి నన్ను కౌగలించుచున్నది. యెరూషలేము కుమార్తెలారా, లేచుటకు ప్రేమకు ఇచ్ఛపుట్టు వరకు లేపకయు కలత పరచకయు నుందుమని నేను మీ చేత ప్రమాణము చేయించుకొందును. పర 8 : 3, 4

నేను ప్రాకారమువంటిదాననై తిని. నా కుచములు దుర్గము లాయెను. అందు వలన అతని దృష్టికి నేను క్షేమము నొందగగిన దాననై తిని.

పర 8 : 10.

మరికొన్ని అశ్లీలాలు, అవినీతులు

గాయము నొందిన వృషణములు గలవాడేగాని వృషణములు కోయబడిన

వాడేగాని యెహోవా సమాజములో చేరకూడదు .... వానికి పదియవ తరము వాడె నను యెహోవా సమాజములో చేరకూడదు. ద్వితీ 23 : 1, 2

సౌలు యోనాతాను మీద బహుగా కోపపడి- ఆ గడగొట్టుదాని కొడుకా, నీకును నీ తల్లిమానమునకును సిగ్గు కలుగునట్లుగా నీవు యెష్షయి కుమారుని స్వీకరించిన సంగతి నాకు తెలిసినది కాదా ? 1 సమూ 20 : 30

దావీదు .... తన ఉపపత్నులైన పదిమంది స్త్రీలను తీసికొని వారిని కావలిలో ఉంచి వారిని పోషించుచుండెనుగాని వారియొద్దకు పోకుండెను, వారు కావలి యందుంచబడినవారై బ్రతికినంతకాలము విధవరాండ్రవలె ఉండిరి.
2 సమూ 20 : 3.

నేను హృదయమున పరస్త్రీని మోహించిన యెడల .... నా భార్య వేరొకని తిరుగలి విసురునుగాక. ఇతరులు ఆమెను కూడుదురుగాక.
యోబు 31 : 9, 10

నిన్ను విడిచి వ్యభిచరించు వారందరిని నీవు సంహరించెదవు.
కీర్త 73 ; 27

జార స్త్రీ పెదవులనుండి తేనె కారును. దాని నోటిమాటలు నూనెకంటెను నునుపైనవి. సామె 5 : 3

నీ యౌవనకాలపు భార్యయందు సంతోషింపుము. ఆమె అతి ప్రియమైన లేడి, అందమైన దుప్పి. ఆమె రొమ్మువలన నీవు ఎల్లప్పుడు తృప్తినొందు చుండుము. సామె 5 : 18, 19.

వేశ్య లోతైన గొయ్యి పరస్త్రీ యిరుకైన గుంట. సామె 23 : 27.

కాబట్టి ప్రభువు సీయోను కుమార్తెల నడినెత్తి బోడిచేయును. యెహోవా వారి మానమును బయలుపరచును. యెష 3 : 17

మూడు సంవత్సరాల దిగంబర సంచారం

ఆ కాలమున యెహోవా ఆమోజు కుమారుడైన యెషయాద్వారా ఈలాగు సెలవిచ్చెను- నీవుపోయి నీ నడుము మీది గోనెపట్ట విప్పి నీ పాదముల నుండి

జోళ్ళు తీసివేయుము. అతడాలాగుచేసి దిగంబరియై జోళ్ళు లేకయే నడుచుచుండగా యెహోవా- నా సేవకుడైన యెషయా ఐగుప్తును గూర్చియు కూషును గూర్చియు సూచనగాను సాదృశ్యముగాను మూడు సంవత్సరములు దిగంబరియై జోడులేకయే నడచుచున్న ప్రకారము అష్షూరు రాజు చెరజట్టిన ఐగుప్తీయులను, తమ దేశమునుండి కొనిపోబడిన కూషీయులను, పిన్నలను, పెద్దలను, దిగంబరులను గాను చెప్పులులేని వారినిగాను పట్టుకొని పోవును. ఐగుప్తీయులకు అవమానమగునట్లు పిరుదుల మీది వస్త్రమును ఆయన తీసివేసి వారిని కొనిపోవును.

యెష 20 : 2-4.

(మీకా 1 : 8 కూడ చూడండి)

యిర్మీయా ఉపన్యాసం

మరియు ఒకడు తన భార్యను త్యజించగా ఆమె అతని యొద్దనుండి తొలగిపోయి వేరొక పురుషునిదైన తరువాత అతడు ఆమె యొద్దకు తిరిగి చేరునా? అలాగు జరుగుదేశము బహుగా అపవిత్రమగునుగదా; అయినను నీవు అనేకులైన విడకాండ్రతో వ్యభిచారము చేసినను నా యొద్దకు తిరిగిరమ్మని యెహోవా సెలవిచ్చుచున్నాడు. చెట్లులేని కొండ ప్రదేశము పైపు నీ కన్నులెత్తి చూడుము; నీతో ఒకడు శయనింపని స్థలమెక్కడ వున్నది. ఎడారి మార్గమున అరబి దేశస్థుడు కాచియుండునట్లుగా నీవు వారికొరకు త్రోవలలో కూర్చుండి యున్నావు. నీ వ్యభిచారముల చేతను నీ దుష్కార్యములచేతను నీవు దేశమును అపవిత్రపరచుచున్నావు. కావున వానలు కురియక మానెను, కడవరి వర్షము లేకపోయియున్నది, అయినను నీకు వ్యభిచార స్త్రీ ధైర్యమువంటి ధైర్యము గలదు సిగ్గుపడనొల్ల కున్నావు .... మరియు రాజైన యోషీయా దినములలో యెహోవా నాకీలాగు సెలవిచ్చెను- ద్రోహినియగు ఇశ్రాయేలు చేయు కార్యము నీవు చూచితివా ? ఆమె ఉన్నతమైన ప్రతి కొండమీదికిని పచ్చని ప్రతిచెట్టు క్రిందికిని పోవుచు అక్కడ వ్యభిచారము చేయుచున్నది. ఆమె ఈ క్రియ లన్నిటిని చేసినను, ఆమెను నా యొద్దకు తిరిగిరమ్మని నేను సెలవియ్యగా ఆమె తిరిగిరాలేదు. మరియు విశ్వాసఘాతకురాలగు ఆమె సహోదరియైన యూదా దాని చూచెను. ద్రోహినియగు ఇశ్రాయేలు వ్యభిచారము చేసిన హేతువు చేతనే నేను ఆమెను

విడిచిపెట్టి ఆమెకు పరిత్యాగ పత్రిక ఇయ్యగా విశ్వాసఘాతకురాలగు ఆమె సహోదరియైన యూదా చూచియు తానును భయపడక వ్యభిచారము చేయుచు వచ్చుచున్నది. రాళ్ళతోను మొద్దులతోను వ్యభిచారము చేసెను, ఆమె నిర్భయముగా వ్యభిచారము చేసి దేశమును అపవిత్రపరచెను. యిర్మీ 3 ; 1. 3, 6-9.

జుగుప్సాకరమైన వంట

యవల అప్పములు చేసివారు చూచుచుండగా దానిని మనుష్య మలముతో కాల్చి భుజింపవలెను. నేను వారిని తోలివేయు జనములలో ఇశ్రాయేలు ఈ ప్రకారము అపవిత్రమైన ఆహారమును భుజింతురని యెహోవా నాకు సెలవిచ్చెను. అందుకు- అయ్యో, ప్రభువా, యెహోవా నేనెన్నడును అపవిత్రత నొందినవాడను కానే, బాల్యమునుండి నేటివరకును చచ్చినదానినైనను, మృగములు చీల్చినదానినైనను నేను తినినవాడను కానే, నిషిద్ధమైన మాంసము నానోట ఎన్నడును పడలేదే అని నేననగా ఆయన- చూడుము, మనుష్య మలమునకు మారుగా నీకు గోమలము నేను నిర్ణయించి యున్నాను. దీనితో నీవు భోజనము సిద్ధపరచుకొనుమని సెలవిచ్చెను. యెహె 4 : 12-15.

యెహెజ్కేలు ఉపన్యాసం

మరియు నేను నీ యొద్దకు వచ్చి నిన్ను చూడగా ఇష్టము పుట్టించు ప్రాయము నీకు వచ్చియుండెను గనుక నీకు అవమానము కలుగకుండ నిన్ను పెండ్లి చేసికొని నీతో నిబంధన చేసికొనగా నీవు నా దానవైతివి; యిదే ప్రభువైన యెహోవా వాక్కు- .... అయితే నీ సౌందర్యమును నీవు ఆధారము చేసికొని నీకు కీర్తి వచ్చినందున నీవు వేశ్యవై దారినపోవు ప్రతివానితో బహుగా వ్యభిచరించుచు వచ్చితివి, పిలిచినవానితో నెల్లపోతివి. మరియు నీ వస్త్రములలో కొన్ని తీసి, చిత్రముగా అలంకరింపబడిన ఉన్నత స్థలములను ఏర్పరచి, వాటిమీద పండుకొని వ్యభిచారము చేసితివి, అట్టి కార్యములు ఎంతమాత్రమును జరుగకూడనివి, అట్టివియు నిక జరుగవు. నేను నీకిచ్చిన బంగారువియు వెండివియునైన ఆభరణములను తీసికొని నీవు పురుషరూప విగ్రహములను చేసికొని వాటితో వ్యభిచరించితివి .... మరియు నీవు నాకు కనిన కుమారులను కుమార్తెలను ఆ బొమ్మలు మ్రింగివేయునట్లు వాటి పేరట వారిని వధించితివి. నీ బాల్యకాలమందు నీవు దిగంబరివై వస్త్రహీనముగా నుండి నీ రక్తములో నీరు పొర్లుచుండిన సంగతి

మనస్సునకు తెచ్చుకొనక ఇన్ని హేయ క్రియలను ఇంక జారత్వమును చేయుచు వచ్చితివి .... మరియు నీవు మదించియున్న నీ పొరుగువారైన ఐగుప్తీయులతో వ్యభిచరించి నీ జారత్వక్రియలను పెంపుచేసి నాకు కోపము పుట్టించితివి .... అంతటితో తృప్తినొందక అష్షూరు వారితోను నీవు వ్యభిచరించితివి, వారితోకూడి జారత్వము చేసినను తృప్తినొందకపోతివి. కనాను దేశము మొదలుకొని కల్దీయ దేశము వరకు నీవు బహుగా వ్యభిచరించినను నీవు తృప్తినొందలేదు. నీ హృదయ మెంత బలహీనమాయెను! సిగ్గుమాలిన వేశ్యాక్రియలైన వీటన్నిటిని జరిగించుటకై నీవు ప్రతి అడ్డదోవను గుళ్ళను ప్రతిరాజవీధిని యొక బలిపీఠమును కట్టుచు, వేశ్యచేయునట్టుచేయక జీతము పుచ్చుకొన నొల్లక యుంటివి. వ్యభిచారిణియగు భార్య తన పురుషుని త్రోసివేసి అన్యులను చేర్చుకొనును గదా? పురుషులు వేశ్యలకు పడుపు సొమ్మిచ్చెదరుగదా: నీ విటకాండ్రు నలుదిక్కుల నుండి వచ్చి నీతో వ్యభిచరించునట్లు వారికందరికి నీవే సొమ్మిచ్చుచు వచ్చితివి, బహుమానముల నిచ్చుచు వచ్చితివి. నీ జారత్వమునకును ఇతర స్త్రీల జారత్వమునకును భేదమే మనగా వ్యభిచరించుటకు ఎవడైనను నీవెంట తిరుగుటయు లేదు, నీకు పడుపు సొమ్మిచ్చుటయులేదు. నీవే ఎదురు జీతమిచ్చితివి. ఇదే నీకును వారికిని కలిగిన భేదము, ఇదే యెహోవా వాక్కు. కాబట్టి వేశ్యా, యెహోవా మాట ఆలకింపుము- ప్రభువైన యెహోవా సెలవిచ్చునదేమనగా- నీవిటకాండ్రతో నీవు నీ సొమ్ము వ్యయపరచి నీవు వ్యభిచారముచేసి నీ మానము నీవు కనపరచుకొనిన దానినిబట్టియు, నీ విటకాండ్రనుబట్టియు, హేయ విగ్రహములను బట్టియు, నీవు వాటి కప్పగించిన నీ బిడ్డల రక్తమును బట్టియు, నీవు సంభోగించిన నీ విటకాండ్ర నందరిని నీ కిష్టులైనవారి నందరిని నీవు ద్వేషించువారి నందరిని నేను పోగుచేయుచున్నాను. వారిని నీ చుట్టూ పోగుచేసి సమకూర్చివారికి నీ మానము కనబడునట్లు నేను దాని బయలు పరచెదను. యెహె 16 : 8, 15-17, 20-22, 26, 28-37

## దేవుడి ఆజ్ఞమేరకు హోషేయ అవినీతులు

యెహోవా **హోషేయ**ద్వారా ఈ మాట సెలవిచ్చెను- జనులు **యెహోవాను** విసర్జించి బహుగా వ్యభిచరించి యున్నారు గనుక నీవుపోయి, వ్యభిచారముచేయు స్త్రీని పెండ్లాడి, వ్యభిచారమువల్ల పుట్టిన పిల్లలను తీసుకొనుము అని ఆయన **హోషేయ**కు ఆజ్ఞ **ఇచ్చెను.** కాబట్టి అతడుపోయి దిబ్లయీము కుమార్తెయైన

గోమెరును పెండ్లి చేసికొనెను. ఆమె గర్భవతియై అతనికొక కుమారుని కనెను.... పిమ్మట ఆమె మరల గర్భవతియై కుమార్తెను కనగా యెహోవా అతనికి సెల విచ్చిన దేమనగా దీనికి లోరూహామా అనగా జాలినొందనిది అని పేరుపెట్టుము, ఇకమీదట నేను ఇశ్రాయేలు వారిని క్షమించను, వారి యెడల జాలిపడను .... లోరూహామా పాలు విడిచిన తరువాత తల్లి గర్భవతియై కుమారుని కనినప్పుడు యెహోవా ప్రవక్తకు సెలవిచ్చిన దేమనగా- మీరు నా జనులుకారు, నేను మీకు దేవుడనైయుండను గనుక లోఅమ్మీ (నా జనము కాదని) యితనికి పేరు పెట్టుము. హోషే 1 : 2-9.

మీరు నా జనులని మీ సహోదరులతోను జాలినొందినవారని మీ స్వదేశీయుల తోను మీరు చెప్పుడి. నేను దాని బట్టలను పెరికివేసి పుట్టిననాటివలె దానిని దిగంబరురాలినిగా చేసి, పాడుపెట్టి యెండిపోయిన భూమివలెను ఉంచి. దప్పిచేత లయపరచకుండునట్లు మీ తల్లి పోకిరి చూపు చూడకయు దాని స్తనములకు పురుషు లను చేర్చుకొనకయు యుండునట్లు మీరు ఆమెతో వాదించుడి. అది నాకు భార్య కాదు, నేను దానికి పెనిమిటిని కాను. హోషే 2 : 1-3.

హోషేయ బెదిరింపులు

వారు యెహోవాను లక్ష్యపెట్టుట మానిరి గనుక వారు భోజనము చేసినను తృప్తిపొందక యుందురు. వ్యభిచారము చేసినను అభివృద్ధి నొందక యుందురు. వ్యభిచార క్రియలు చేయుట చేతను మద్యపానముచేతను వారు మతిచెడిరి .... వ్యభిచార మనస్సువారిని త్రోవతప్పింపగా వారు తమ దేవుని విసర్జించి వ్యభిచ రింతురు. పర్వతముల శిఖరము మీద బలుల నర్పింతురు, కొండలమీద ధూపము వేయుదురు, సింధూర వృక్షముల క్రిందను మస్తకి వృక్షములక్రిందను నీడ మంచిదని అచటనే ధూపము వేయుదురు, అందువలననే మీ కుమార్తెలు వేశ్యలైరి, మీ కోడండ్లును వ్యభిచారిణులైరి. జనులు తామే వేశ్యలతో సాంగత్యము చేయుచు బలుల నర్పింతురు గనుక మీ కుమార్తెలు వేశ్యలగుటను బట్టి నేను వారిని శిక్షింపను, మీ కోడండ్లు వ్యభిచరించుటను బట్టి నేను వారిని శిక్షింపను, వివేచనలేని జనము నిర్మూలమగును. హోషే 4 : 10-14

షోమ్రోను తన దేవునిమీద తిరుగుబాటు చేసెను గనుక అది శిక్షనొందును' జనులు కత్తిపాలగుదురు, వారి పిల్లలు రాళ్ళకువేసి కొట్టబడుదురు, గర్భిణీస్త్రీల కడుపులు చీల్చబడును. హోషే 13 : 16

## పరిశుద్ధాత్మతో సంపర్కం, తద్వారా గర్భం !

యేసు క్రీస్తు జనన విధమెట్లనగా, ఆయన తల్లియైన మరియ యోసేపునకు ప్రధానము చేయబడిన తరువాత వారేకము కాక మునుపు ఆమె పరిశుద్ధాత్మ వలన గర్భవతిగా ఉండెను .... అతడు (యోసేపు) ఈ సంగతులను గూర్చి ఆలోచించు కొనుచుండగా, ఇదిగో ప్రభువు దూత స్వప్నమందు అతనికి ప్రత్యక్షమై- దావీదు కుమారుడవైన యోసేపూ నీ భార్యయైన మరియను చేర్చుకొనుటకు భయపడకుము, ఆమె గర్భము ధరించినది పరిశుద్ధాత్మవలన కలిగినది .... అని ప్రభువు ప్రవక్త ద్వారా పలికిన మాట నెరవేరునట్లు ఇదంతయు జరిగెను.

మత్త 1 : 18, 20, 23.

[పరిశుద్ధ గ్రంథంలో పై విధంగా చెప్పబడిన విషయాన్ని కేథలిక్ బైబిలు తెలుగు వెర్షన్‌లో "యేసుక్రీస్తు పుట్టుక రీతి యెట్టిదన, ఆయన తల్లియైన మరియమ్మకు యేసేపుతో వివాహమైనది. కాని వారిరువురు కాపురము చేయకముందే పవిత్రాత్మ ప్రభావము వలన మరియమ్మ గర్భము ధరించినది" అని పేర్కొని ఫుట్‌నోట్‌లో 'మూల భాషానుసారము ఇచ్చట "వివాహము నిశ్చయింపబడినది" అనియు అనువదింపవచ్చును. కాని యూదుల ఆచార ప్రకారము నిశ్చయింపబడిన వివాహమందు వివాహపు హక్కులున్నవి' అని యివ్వబడింది- అను]

మరియ- నేను పురుషుని ఎరుగని దాననే, యిదేలాగు జరుగునని దూతతో అనగా- పరిశుద్ధాత్మ నీ మీదికి వచ్చును, సర్వోన్నతుని శక్తి నిన్ను కమ్ముకొనును గనుక పుట్టబోవు శిశువు పరిశుద్ధుడై దేవుని కుమారుడనబడును.

లూకా 1 : 34, 35.

[కన్యకు గర్భం రావడమనే మూఢ నమ్మకం చాల అవమానకరమైనది. పురుషుడు తండ్రి అయితే అందులో న్యూనత ఏముంది ? మానవ మాతకు దేవుడు బిడ్డ కాగలిగితే మానవ పితకుగూడ బిడ్డ ఎందుకు కాగూడదు ?

అందులో మహాత్యముందనుకుంటే అందమైన మగదేవదూత గాబ్రియేలే ఎందుకు కావలసి వచ్చాడు ? దనాయి మీదికి బంగారు మేఘంలో బృహస్పతి వచ్చినట్లుగానే కన్యమీదికి పరిశుద్ధాత్మ ఎందుకు రావాలి ? పరిపూర్ణమైన పరమాత్మమీద నిజమైన విశ్వాసముంటే ఈ రకంగా గర్భం రావడం, యేసును కనడం అసహ్యంగా తోస్తుంది. అది దైవదూషణగా కూడ కన్పిస్తుంది. ]

## ఎలీసబెతుకు గర్భం వచ్చిన తీరు

ఎలీసబెతు గొడ్రాలైనందున వారికి పిల్లలు లేకపోయిరి, మరియు వారిద్దరు బహుకాలము గడచిన వృద్ధులైరి .... అప్పుడా దూత అతనితో- జెకర్యా భయ పడకుము, నీ ప్రార్థన వినబడినది, నీ భార్యయైన ఎలీసబెతు నీకు కుమారుని కనును. లూకా 1 : 7, 13.

## ఒక స్త్రీని అన్నదమ్ములు ఒకరు మరణించిన తరువాత మరొకరు చొప్పున ఏడుగురు పొందవచ్చు !

యేడుగురు సహోదరులుండిరి. మొదటివాడొక స్త్రీని పెండ్లి చేసికొని సంతానము లేక చనిపోయెను. రెండవ వాడును మూడవ వాడును ఆమెను పెండ్లి చేసికొనిరి. ఆ ప్రకారమే యేడుగురును ఆమెను పెండ్లాడి సంతానము లేకయే చనిపోయిరి. పిమ్మట ఆ స్త్రీయు చనిపోయెను. కాబట్టి పునరుత్థానమందు ఆమె వారిలో ఎవని కి భార్యగా ఉండును ? ఆ యేడుగురికిని ఆమె భార్యగా ఉండెను గదా అనిరి. అందుకు యేసు- ఈలోకపు జనులు పెండ్లి చేసికొందురు, పెండ్లికియ్యబడుదురుగాని పరమును మృతుల పునరుత్థానమును పొందుటకు యోగ్యులని యెంచబడినవారు పెండ్లి చేసికొనరు, పెండ్లికియ్యబడరు.

లూకా 20 : 29-35.

## వ్యభిచారము చేస్తూ పట్టుబడిన స్త్రీని దండించుటకు నిరాకరించిన

శాస్త్రులును పరిసయ్యులును, వ్యభిచారమందు పట్టుబడిన యొక స్త్రీని తోడుకొనివచ్చి ఆమెను మధ్యనిలువ బెట్టి- బోధకుడా, ఈ స్త్రీ వ్యభిచారము చేయు

చుండగా పట్టుబడెను, అట్టివారిని రాళ్ళురువ్వి చంపవలెనని ధర్మశాస్త్రములో మోషే మనకాజ్ఞాపించెనుగదా, అయినను నీవేమి చెప్పుచున్నావని ఆయన నడిగిరి. ఆయన మీద నేరము మోపవలెనని ఆయనను శోధించుచు ఈలాగున అడిగిరి. అయితే యేసు వంగి, నేలమీద వ్రేలితో ఏమో వ్రాయుచుండెను. వారాయనను పట్టువదలక అడుగుచుండగా ఆయన తలయెత్తి చూచి- మీలో పాపము లేనివాడు మొట్టమొదట ఆమెమీద రాయి వేయవచ్చునని వారితో చెప్పి, మరల వంగి నేలమీద వ్రాయుచుండెను. వారా మాట విని పెద్దవారు మొదలుకొని చిన్నవారి వరకు ఒకనివెంట ఒకడు బయటికి వెళ్ళిరి, యేసు ఒక్కడే మిగిలెను, ఆ స్త్రీ మధ్యను నిలువబడి యుండెను, యేసు తలయెత్తి చూచి అమ్మా వారెక్కడ ఉన్నారు ? ఎవరును నీకు శిక్ష విధింపలేదా? అని అడిగినప్పుడు ఆమె- లేదు ప్రభువా అనెను. అందుకు యేసు నేనును నీకు శిక్ష విధింపను, నీవు వెళ్ళి ఇక పాపము చేయకుమని ఆమెతో చెప్పెను. యోహా 8 : 3-11

[ క్రీస్తు వేశ్యావృత్తిని వ్యతిరేకించినట్లు కనిపించదు. మత్త 21 : 31, 32; మార్కు 2 : 15, 16; లూకా 7 : 37, 39, 47; యోహా 4 : 18 చూడండి.]

## నపుంసకత్వం గొప్పదనం

తల్లిగర్భము నుండి నపుంసకులుగ పుట్టిన వారు గలరు, మనుష్యుల వలన నపుంసకులుగా చేయబడిన నపుంసకులును గలరు, పరలోక రాజ్యము నిమిత్తము తమ్మును తామే నపుంసకులనుగా చేసికొనిన నపుంసకులును గలరు.

మత్త 9 : 12

నీ చెయ్యియైనను నీ పాదమైనను నిన్ను అభ్యంతర పరచిన యెడల, దానిని నరికి నీ యొద్దనుండి పారవేయుము, రెండు చేతులును రెండుపాదములును కలిగి నిత్యాగ్నిలో పడవేయబడుటకు కంటె కుంటివాడవుగనో అంగ విహీనుడవుగనో జీవములో ప్రవేశించుట నీకు మేలు. నీ కన్ను నిన్ను అభ్యంతర పరచిన యెడల దాని పెరికి నీ యొద్దనుండి పారవేయుము. రెండు కన్నులు గలిగి అగ్ని గల నరకములో పడవేయబడుట కంటె ఒక కన్ను కలిగి జీవములో ప్రవేశించుట నీకు మేలు. మత్త 18 : 8, 9.

వ్యభిచారము చేయవద్దని చెప్పబడినమాట మీరు విన్నారు గదా, నేను మీతో చెప్పునదేమనగా- ఒక స్త్రీని మోహపు చూపుతో చూచు ప్రతివాడు అప్పుడే తన హృదయమందు ఆమెతో వ్యభిచారము చేసినవాడగును. నీ కుడికన్ను నిన్ను అభ్యంతర పరచిన యెడల దాని పెరికి నీ యొద్దనుండి పారవేయుము, నీ దేహ మంతయు నరకములో పడవేయబడకుండ నీ అవయవములలో నొకటి నశించుట నీకు ప్రయోజనకరము గదా. నీ కుడిచెయ్యి నిన్నభ్యంతర పరచిన యెడల దాని నరికి నీ యొద్దనుండి పారవేయుము. నీ దేహమంతయు నరకములో పడకుండ నీ అవయవములలో ఒకటి నశించుట నీకు ప్రయోజనకరము గదా.

మత్తి 5 : 27-30.

[ఈ దైవాజ్ఞను ఒరిగన్ మొదలైన తొలి క్రైస్తవులు నమ్మకంగా అనుసరించారు. రష్యాలో చాలాకాలం ఒక క్రైస్తవశాఖవారు క్రీస్తు ఆజ్ఞకు విధేయులై విత్తులు తీయడాన్ని ఆచరణలో పెట్టారు.]

## యేసు బోధించిన ద్వేషభావం

ఎవడైనను నా యొద్దకు వచ్చి తన తండ్రిని తల్లిని భార్యను పిల్లలను అన్నదమ్ములను అక్కచెల్లెండ్రను తన ప్రాణమును సహా ద్వేషింపకుంటే వాడు నా శిష్యుడు కానేరడు. లూకా 14 : 26

## యేసు సన్యాస బోధ

ఆ ప్రకారమే మీలో తనకు కలిగిన దంతయు విడిచిపెట్టనివాడు నా శిష్యుడు కానేరడు. లూకా 14 : 33.

వారు దోనెలను దరికిచేర్చి, సమస్తమును విడిచిపెట్టి ఆయనను వెంబడించిరి. లూకా 5 : 11.

నా నామము నిమిత్తము అన్నదమ్ములనైనను, అక్కచెల్లెండ్లనైనను, తండ్రినైనను, తల్లినైనను, పిల్లలనైనను, భూములనైనను, ఇండ్లనైనను విడిచిపెట్టిన ప్రతివాడును నూరురెట్లు పొందును. ఇదిగాక నిత్య జీవమును స్వతంత్రించుకొనును. మత్తి 19 : 29.

శిష్యులలో మరియొకడు- ప్రభువా నేను మొదట వెళ్ళి, నా తండ్రిని పాతిపెట్టుటకు నాకు సెలవిమ్మని ఆయనను అడుగగా యేసు అతని చూచి- నన్ను వెంబడించుము, మృతులు తమ మృతులను పాతిపెట్టుకొన నిమ్మని చెప్పెను.
మత్త 8 : 21, 22.

## ద్వితీయ జన్మ

అందుకు యేసు ఒకడు క్రొత్తగా జన్మించితేనేగాని అతడు దేవుని రాజ్యమును చూడలేడని నీతో నిశ్చయముగా చెప్పుచున్నాననెను. అందుకు నీకొదేము- ముసలివాడైన మనుష్యుడేలాగు జన్మించగలడు ? రెండవసారి తల్లిగర్భమందు ప్రవేశించి జన్మింపగలడా అని ఆయనను అడిగెను. యోహా 3 : 3, 4.

## బ్రహ్మచర్యం కావాలట- పెండ్లి వద్దట

స్త్రీని ముట్టకుండుట పురుషునికి మేలు .... అయినను ఒకడొక విధమునను మరియొకడు మరియొక విధమునను ప్రతి మనుష్యుడు తనకున్న కృపావరమును దేవునివలన పొందియున్నాడు. నావలె నుండుట వారికి మేలని పెండ్లికాని వారితోను విధవరాండ్రతోను చెప్పుచున్నాను. అయితే మనస్సు నిలుపలేని యెడల పెండ్లి చేసికొనవచ్చును, కామత ప్తులగుట కంటె పెండ్లి చేసికొనుట మేలు .... ఇప్పటి యిబ్బందినిబట్టి పురుషుడు తానున్న స్థితిలోనే యుండుట మేలని తలంచుచున్నాను.... మీరు చింతలేనివారై యుండవలెనని కోరుచున్నాను పెండ్లికానివాడు ప్రభువును ఏలాగు సంతోషపెట్టగలనని లోకవిషయమైన వాటిని గూర్చి చింతించుచున్నాడు. అటువలెనే పెండ్లి కాని స్త్రీయు కన్యకయు తాము శరీర మందును ఆత్మయందును పవిత్రురాండ్రయి యుండుటకు ప్రభువు విషయమైన కార్యములను గూర్చి చింతించుచుందురుగాని పెండ్లియైనది భర్తను ఏలాగు సంతోషపెట్టగలనని లోక విషయమైన వాటిని గూర్చి చింతించుచున్నది. మీకు ఉరి యొడ్డవలెనని కాదుగాని మీరు యోగ్యప్రవర్తనులై యుండవలెనని యిది మీ ప్రయోజనము నిమిత్తమే చెప్పుచున్నాను .... ఎవడైనను తన కుమార్తెకు పెండ్లిచేయ నవసరము లేక యుండి, అతడు స్థిరచిత్తుడును, తన యిష్ట ప్రకారము జరుప శక్తి గలవాడునై, ఆమెను వివాహము లేకుండ ఉంచవలెనని తన మనస్సులో నిశ్చయించుకొనిన యెడల బాగుగా ప్రవర్తించుచున్నాడు. కాబట్టి తన కుమార్తెకు పెండ్లిచేయువాడు

బాగుగా ప్రవర్తించుచున్నాడు, పెండ్లిచేయనివాడు మరి బాగుగా ప్రవర్తించుచున్నాడు. భార్య తన భర్త బ్రదికియున్నంత కాలము బద్ధురాలైయుండును, భర్త మృతిపొందిన యెడల ఆమె కిష్టమైన వానిని పెండ్లిచేసికొనుటకు స్వతంత్రురాలై యుండునుగాని ప్రభువునందు మాత్రమే పెండ్లి చేసికొనవలెను. అయితే ఆమె విధవరాలుగా ఉండినట్టయిన మరి ధన్యురాలని నా అభిప్రాయము.
1 కొరిం 7 : 1, 7-9, 27, 32-35, 37-40.

## తొలి క్రైస్తవుల్లో అవినీతులు

మీలో జారత్వమున్నదని వదంతి కలదు. మీలో ఒకడు తన తండ్రి భార్యను ఉంచుకొన్నాడట. అట్టి జారత్వము అన్యజనులలోనైనను జరుగదు. ఇట్లుండియు మీరుప్పొంగుచున్నారేగాని మీరెంత మాత్రము దుఃఖపడి ఈలాటి కార్యము చేసిన వానిని మీలో నుండి వెలివేసిన వారుకారు .... మీరు అతిశయపడుట మంచిదికాదు. పులిసిన పిండి కొంచెమైనను ముద్దంతయు పులియజేయునని మీరెరుగరా ? 1 కొరిం 5 : 1, 2, 6.

అన్యాయస్థులు దేవుని రాజ్యమునకు వారసులు కానేరరని మీకు తెలియదా ? మోసపోకుడి .... అన్నిటియందు నాకు స్వాతంత్ర్యము కలదుగాని అన్నియు చేయదగినవి కావు. అన్నిటియందు నాకు స్వాతంత్ర్యము కలదుగాని నేను దేని చేతను లోపరచుకొనబడనొల్లను. భోజన పదార్థములు కడుపునకును కడుపు భోజన పదార్థములకును నియమింపబడియున్నవి, దేవుడు దానిని నాశనము చేయును. దేహము జారత్వము నిమిత్తము కాదుగాని, ప్రభువు నిమిత్తమే, ప్రభువు దేహము నిమిత్తమే. దేవుడు ప్రభువును లేపెను, మనలను కూడ తనశక్తివలన లేపును. మీ దేహములు క్రీస్తునకు అవయవములై యున్నవని మీరెరుగరా ? నేను క్రీస్తు యొక్క అవయవములను తీసికొని వేశ్యయొక్క అవయవములుగా చేయుదునా ? అదెంత మాత్రమును తగదు. వేశ్యతో కలిసికొనువాడు దానితో ఏకదేహమై యున్నాడని మీరెరుగరా ? వారిద్దరు ఏకశరీరమై యుందురు అని మోషే చెప్పుచున్నాడుగదా ? అటువలె ప్రభువుతో కలిసికొనువాడు ఆయనతో ఏకాత్మయై యున్నాడు. జారత్వమునకు దూరముగా పారిపోవుడి. మనుష్యుడు చేయు ప్రతి పాపమును దేహమునకు వెలుపల ఉన్నదిగాని జారత్వము చేయువాడు తన సొంత

శరీరమునకు హానికరముగా పాపము చేయుచున్నాడు. మీ దేహము దేవుని వలన మీకు అనుగ్రహింపబడి, మీలో నున్న పరిశుద్ధాత్మకు ఆలయమై యున్నదని మీరెరుగరా ? మీకు మీ సొంతుకారు. 1 కొరిం 6 : 9. 12-19.

యోహాను ప్రకటనలోని జుగుప్సాకర కవిత

నీమీద తప్పు ఒకటి నేను మోపవలసి యున్నది, ఏమనగా, తాను ప్రవక్త్రినని చెప్పుకొనుచున్న యెజెబెలను స్త్రీని నీ వుండనిచ్చుచున్నావు. జారత్వము చేయుటకును, విగ్రహములకు బలియిచ్చిన వాటిని తినుటకును అది నా దాసులకు బోధించుచు వారిని మోసపరచుచున్నది. మారు మనస్సు పొందుటకు నేను దానికి సమయమిచ్చితినిగాని అది తన జారత్వము విడిచిపెట్టి మారుమనస్సు పొందనొల్లదు.
ప్రక 2 : 20, 21

తాము చేయుచున్న నరహత్యలను మాయ మంత్రములును జారచోరత్వములను చేయకుండునట్లు వారు మారు మనస్సు పొందినవారు కారు.
ప్రక 9 : 21.

దూత అతని వెంబడివచ్చి- మహోద్రేకముతో కూడిన తన వ్యభిచార మద్యమును సమస్తజనులకు త్రాగించిన యీ మహా బబులోను కూలిపోయెను అని చెప్పెను. ప్ర 14 : 8

దేవదూతలలో ఒకడు వచ్చి నాతో మాటలాడుచు ఈ లాగు చెప్పెను- నీ విక్కడికి రమ్ము, విస్తార జలముల మీద కూర్చున్న మహావేశ్యకు చేయబడు తీర్పు నీకు కనుపరచెదను. భూరాజులు ఆమెతో వ్యభిచరించిరి, భూనివాసులు ఆమె వ్యభిచార మద్యములో మత్తులైరి. అప్పుడతడు ఆత్మవశుడనైన నన్ను అరణ్యమునకు కొనిపోగా దేవదూషణ నామములతో నిండుకొని ఏడు తలలును పది కొమ్ములును గల ఎఱ్ఱని మృగముమీద కూర్చుండిన యొక స్త్రీని చూచితిని. ఆ స్త్రీ ధూమ్రరక్తవర్ణముగల వస్త్రము ధరించుకొని బంగారముతోను రత్నములతోను తాను చేయుచున్న వ్యభిచార సంబంధమైన అపవిత్ర కార్యములతోను నిండిన యొక సువర్ణపాత్రను తనచేత పట్టుకొని యుండెను. దాని నొసట దాని పేరు ఈలాగు వ్రాయబడి యుండెను- మర్మము, వేశ్యలకును భూమిలోని ఏహ్యమైన వాటికిని తల్లియైన మహా బబులోను ... మరియు ఆ దూత నాతో

ఈలాగు చెప్పెను- ఆ వేశ్యకూర్చున్నచోట నీవు చూచిన జనములు ప్రజలను, జన సమూహములను, జనములను, ఆయా భాషలు మాటలాడువారిని సూచించును. నీవు ఆ పదికొమ్ములుగల ఆ మృగమును చూచితివే, వారు ఆ వేశ్యను ద్వేషించి' దానిని దిక్కులేని దానిగాను దిగంబరిగానుచేసి, దాని మాంసము భక్షించి అగ్నిచేత దానిని బొత్తిగా కాల్చివేతురు. ప్రక 17 : 1-5, 15, 16.

[ "ఆ స్త్రీ .... ఏహ్యమైన కార్యములతోను తాను చేయుచున్న వ్యభిచార సంబంధమైన అపవిత్ర కార్యములతోను నిండిన యొక సువర్ణ పాత్రను తన చేత పట్టుకొని యుండెను" అని పరిశుద్ధ గ్రంథములోని ప్రక 17 : 4 లో పేర్కొనబడిన విషయాన్ని తెలుగు వాడుకభాషలోని పవిత్ర గ్రంధంలో "ఆమెచేతిలో బంగారు బంగారుపాత్ర ఒకటి వుంది. దానినిండా అసహ్యమైన, ఆమె వ్యభిచార సంబంధమైన మాలిన్యం నిండి వుంది" అని అనువదించారు- అను ]

సమస్తమైన జనములు మహోద్రేకముతో కూడిన దాని వ్యభిచార మద్యమును త్రాగి పడిపోయిరి, భూరాజులు దానితో వ్యభిచరించిరి. భూలోకమందలి వర్తకులు దాని సుఖభోగముల వలన ధనవంతులైరి. ప్రక 18 : 3

ఆయన తీర్పులు సత్యములును న్యాయములునై యున్నవి, తన వ్యభిచారముతో భూలోకమును చెరిపిన గొప్పవేశ్యకు ఆయన తీర్పు తీర్చి తన దాసుల రక్తమునుబట్టి దానికి ప్రతిదండన చేసెను. ప్ర. 19 : 2.

— o —